శ్రీ మ త్

# అ భి న వ స ర స్వ తి.

—:(౦):—

[ఇది మాసమున కొకసారి ప్రచురింపఁబడును.]

సంపుటము ౨. } జా న పా డు. సాధా॥సం॥ చైత్రవైశాఖములు { సంచిక ౪—౫.

## స్వ వి ష య ము.

———

గడచిన సంచికలలోఁ బ్రచురించిన యఘశాల ప్రహసనము 7-వ పేజీ మొదలుకొని క్రమము తప్పియున్నందున నా 7-8 పేజీ లీమారు మరలఁ బ్రచురించబడుచున్నవి. కావునఁ జదువరులు సవరించుకొందురుగాక. తంగెడ నరసింహముగారిచే నీయబడిన లక్ష్మీవిలాసమను మరియొక ప్రాచీన ప్రబంధ మొక్కటీమారు ప్రారంభింపఁ బడుచున్నది. బెల్లంకొండ రామారావుగారిచే గీర్వాణమున వ్రాయబడిన బ్రాహ్మణశబ్దవిచార మీమారు విద్వద్రంజనముగఁ బ్రచురించి జూన్ నెల విస్తరించి తెనుఁగున వ్రాయఁబూనితి.

### అశాస్త్రీయప్రతిష్ఠ.

నిర్ణయసింధువు.

శ్లో॥ హంత్యర్థహీనా కర్తారం మంత్రహీనా తు ఋత్విజం ।
స్త్రియం లక్షణహీనా చ న ప్రతిష్ఠా సమో రిపుః॥

లోకమున దేవతాప్రతిష్ఠాదికముఁ జేయునపుడు కడుజాగ్రత్తమైసంచరించవలయును అట్లాచరించనిచో నదియే శత్రుతుల్యమై యనిష్టఫలదాయకంబగును విధ్యుక్తములగు వ్యాపారములు సరిగా నొనరించక యథాలోపము జేసినమీదకర్తకే మరణము సంఘటించును. మంత్రమంత్రలోపముఁ జేసిన ఋత్విజుఁడు రూపుమాయును. లక్షణభంగముంగాంచినయజమానుని భార్యకు మోసము వచ్చును. ఇందుకు దార్కాణముగ వర్తమానమున జరిగినయొక వృత్తాంతము వివరించెద- కలిమహాత్మ్యమున నుత్కృష్టవర్ణస్థుల నికృష్టవర్ణస్థులు కానూహించుటయు నపకృష్టవర్ణస్థు లుత్కృష్టవర్ణస్థులు కానుత్సహించుటయు నెందరు రథకారులు తమకులమున కనాదిసిద్ధముగ నేర్పడి యున్న యాగసాలప్రముఖ సంజ్ఞలను త్సన్నములఁ జేసియు శాస్త్రీయమును సార్థకమును నగు విశ్వబ్రాహ్మణశబ్దమొకటియుండఁ బాల్చి బ్రాహ్మణవర్ణోచితములగు కొన్నికర్మలాచరించి తత్కాలమర్యాద లితరులు తమకుఁ జేయువారు లేకున్నను దమంతఁ దమరై యనాచరించుకొనుచుండుటయు సర్వజనైకవేద్యమైయున్నది. విశ్వబ్రాహ్మణశబ్దమట్లసార్థమును నశాస్త్రీయమును గాక యున్నయెడలఁ బలుమారులీపత్రికయందుఁ జేయఁబడెడి పూర్వపక్షముల సమర్థించి సాధువు నేలఁ జేసికొనరు- మనవాండ్లు మీరు విశ్వబ్రాహ్మణశబ్దవాచ్యులెట్లయితిరని యడిగినపుడు మేము విశ్వకర్మసంతతివారమగుటమూలాన యని బదులు ప్రశ్నయొకటి చేయుటయె తెలియునుగాని యొకవేళ విశ్వకర్మసంతతివారైనను విశ్వబ్రాహ్మణులెట్లగుదురో నిజమెఱుగజాలరైరి పైనవిశ్వశబ్దమున్నంతనే విశ్వబ్రాహ్మణులగుదుమని తలంచుటయే వీరి పాండిత్యముం దెలుపుచున్నది, ఇట్టిప్రయత్నశీలురగు వీరిలో గుంటూరితాలూకా ప్రత్తిపాడను నూరఁజామర్తి వెరెయ్యయను నతఁడు కొద్దిదినములనుంచి తద్దినంవగైరా చిల్లర మంత్రములు కొన్ని నేర్చుకొని పెద్దశాస్త్రులతీవింగుండలాది భూషితవిగ్రహుండై తమయిండ్లయాజ్ఞికములఁ జేయించ మొదలుబెట్టి క్రమముగా నితరకులస్థుల యిండ్లఁగూడ ఁదత్కాలాపమును దిగఁ బ్రయత్నించుచుండెఁగాని మనోరథము సిద్ధించదయ్యె - ఇట్లుండ దగ్రామమున

బొల్లాపల్లి వెంకటప్పయ్యయను నొకసుజనుఁడు విష్ణ్వాలయమున ధ్వజస్తంభముఁ వేయించుచు మామూలురీతిఁదత్ప్రతిష్ఠాకృత్యమొక భూసురోత్తమునిచే నిర్వర్తింపఁజేయ నీవెఱ్ఱి య్యమున్నగు బత్తులఁ దనను నచ్చటవాస్తుపూజయనియు నేమోయనియుఁగొంతయాజ్ఞికసంబంధమును బుచ్చుకొనఁజూచినవారి కెవ్వరును ననుకూలురుగాక యథాపూర్వముగ సర్వముఁ నిర్వర్తించిరి - అందుపైదమయాటసాగక పోయెనన్న యాతురత్వమునను మూర్త విచారణగూడఁజేయక మరునాఁడె పదిరిగుంజకుపయోగించెడి యొక త్రుటుకఱ్ఱను దమచేతిలోనిపని యేకొంపున సరిగాఁజెక్కి యాయూరి వీరభద్రాలయములో బట్టుపట్టుమని వెంరెయ్య మేనత్త కుమారుఁడగు కాకుమానుగురులింగంయాజమాన్యముతో సమంత్రకముగ స్తంభప్రతిష్ఠంజరిగించిరి- వీరిపుట్టియంతయే మునిగినదని యోయో మా యాయాలయమందలి యర్చకుఁడు గుడిలోనికిఁబ్రవేశించనీయనన్న మీ దేవునితో మాకవసరము లేదు గావునదలుపులువేసికొని పొమ్మనిరట-ఆహా యాజినాధికారమునకై వీరెన్ని లోపములైనను నొప్పుకొనుచున్నారు కదా శ్లో॥ అన్యథాచింతితంకార్యం దైవమన్యత్ర చింతయేత్। అనురీతిని సప్రతిష్ఠజరిగిన మూఁడవదినముననే టక్కుననాగురులింగముకుమారుఁడు పరలోకగతుఁడయ్యె. పాపమిదియంతయు నీపిల్లవాని ప్రాణములుదీయవచ్చినదికాబోలు అందుమీఁదమాత్ర మాబత్తులింతపర్యంతము ధ్వజస్తంభము తెరువుపోక పోవుటట్లుండ దానికిగట్టిన మోకులు సైతమూడదీసివానివారికివ్వరైరి గ్రామస్థులకెవ్వరికిని రుచించనియీలాటివిమంత్రార్థలక్షణహీనప్రతిష్ఠలు జరపిన నెవ్వారికిని నేతాదృక్ఫలమెలభించుచుండునుగాని యన్యముకాదు.

## బ్రాహ్మణశబ్దవిచారము

లోకేజాతింక్రియాం గుణంసంజ్ఞాం వాప్రవృత్తినిమిత్తీకృత్య ప్రతిపాద్యప్రతిపాదకభావసంబంధేనశబ్దా అర్థేషు వర్తంత ఇతి స్థితం- యథా-గౌ రశ్వ ఇతిజాత్యా పాచకః పాఠక ఇతిక్రియయా శుక్లో

గుణఇతి గుణేన జయ్యటః కైయట ఇతిసంజ్ఞయాచ ప్రవృత్తిః-ఏ
వంస్థితే బ్రాహ్మణశబ్దః కింజాతివాచీ యద్వా క్రియావాచీ ఉతగు
ణవాచీ అథవాసంజ్ఞావాచీ ఇతి అయమంశ ఇహవిచార్యతే -

నతావజ్జాతివాచీ బ్రాహ్మణత్వజాతే ర్దుర్నిరూపత్వాత్ -కు
తో దుర్నిరూపత్వమితిచే దుచ్యతే - కింబ్రహ్మముఖజత్వంబ్రాహ్మణ
త్వం యద్వాబ్రాహ్మణేనవిధివదూఢాయాంబ్రాహ్మణ్యా ముత్పన్న
త్వం యద్వాయజనాదిషట్కర్మత్వం అథవాబ్రహ్మజ్ఞానవత్వం- న
తావదాద్యం ఇదానీంబ్రాహ్మణత్వేనవ్యవహ్రియమాణేషుబ్రహ్మ
ముఖజత్వానుపపత్తేః-నద్వితీయం బ్రాహ్మణేనేతితృతీయాన్తశబ్దగత
బ్రాహ్మణత్వస్య పరిష్కృతస్య చైక్యేన ఆత్మాశ్రయాత్ - నతృతీ
యంఅనుపనీతస్య అబ్రాహ్మణత్వాత్ శూద్రాదేరపి షట్కర్మాచ
రణేన బ్రాహ్మణత్వాపాతాచ్చ నచతుర్థం బ్రహ్మజ్ఞానినాం జనకా
దీనాం క్షత్రియాదీనామపి బ్రాహ్మణత్వాపత్తేః ఏతస్మా న్నజాతి
వాచీబ్రాహ్మణశబ్దః- నాపిక్రియావాచీ బ్రహ్మజ్ఞానస్యమానసిక క్రి
యాత్వేపి నబ్రహ్మజ్ఞానవాచీబ్రాహ్మణశబ్దః - బ్రాహ్మోఽజాతా
వితివ్యాకరణవిరోధాత్ -అజాతౌహి బ్రాహ్మ ఇతిస్యాత్ - బ్రహ్మ
జ్ఞానిషు జనకాదిక్షత్రియేష్వపి బ్రాహ్మణవ్యవహారప్రసంగాచ్చ-నచే
తః ప్రభృతితథావ్యవహరిష్యామ ఇతివాచ్య మనాదివ్యవహారస్యైవ
గ్రాహ్యత్వాత్ -నాపిగుణవాచీ శుక్లాదిగుణేష్వనంతర్భావా ద్బ్రాహ్మ
ణత్వస్య నాపిసంజ్ఞావాచీ.నహికస్యచిద్వ్యక్తివిశేషస్యబ్రాహ్మణఇతినా
మకృతం-ఇతిపూర్వపక్షేప్రాప్తేబ్రూమః జాతివాచీబ్రాహ్మణశబ్దఇతి
బ్రాహ్మోఽజాతావిత్యనుశాసనాత్ బ్రాహ్మణోఽస్యముఖమాసీ
దితిశ్రుతేశ్చ-నచశ్రుతావపిబ్రాహ్మణశబ్దోనజాతివాచీతివాచ్యం బా
హూరాజన్యః కృత ఇత్యాదిక్షత్రియాదిపదసమభివ్యాహారసద్భావా
త్ -తర్హి కాబ్రాహ్మణత్వజాతిరితిచే దుచ్యతే బ్రాహ్మణేనవిధివ
దూఢాయాంబ్రాహ్మణ్యాముత్పన్నత్వమితి - నాత్మాశ్రయః తద్గత
బ్రాహ్మణత్వస్యాప్యేవంవిధత్వా దనాదిత్వాచ్చ ప్రవాహవత్- హం
తతర్హి అబ్రాహ్మణాఏవవ్యాసశుకశౌనకఋష్యశృంగాదయఇతిచేన్మ

వంలోకాతిగప్రాభవానాం స్వాతంత్ర్యేణకుతశ్చిన్నిమిత్తాచ్ఛరీరపరిగ్ర
హాదికంకృతవతాం దేహాన్యాత్మవిదాం వ్యాసాదీనాంచరితస్యయు
గాంతరవిషయస్యోహదురుదాహరత్వాత్ - నహీదానీమయోనేర్వి
యోనేర్వాజాతోమనుష్య ఉపలభ్యతే ఉపపద్యతేవా - భవంతుతే
వ్యాసాదయోమహాత్మానః తథాపి కథంతేషాంబ్రాహ్మణత్వమితి
చేద్బ్రాహ్మణబీజప్రభవత్వాద్బ్రాహ్మణేనవిధివత్సంస్కృతత్వాదీశ్వ
రేణానుగ్రహీతత్వాచ్చతేషాంబ్రాహ్మణత్వమితివిద్ధి - నచయుగాం
తరీయపురుషనిష్ఠమేవబ్రాహ్మణత్వం కలియుగేప్యాశ్రియితవ్యమితి
వాచ్యంయుగాంతరీయధర్మాణాంకలియుగధర్మాణాంచపార్థక్యాత్
పూర్వయుగేషుహిగురుదారగమనగోవధవిధవోద్వాహాదయోమను
ష్యాణాంధర్మాఏవ కలియుగేత్వమీసుతరామధర్మాఏవయథా తథై
వాయమపి - నహీదానీంబ్రాహ్మణ బీజాచ్ఛూద్రాది యోన్యాము
ద్భూతోబ్రాహ్మణఇతివ్యవహ్రియతే -వ్యవహారాశ్రయో హిబ్రా
హ్మణత్వాదిః పరమార్థతోద్వైతస్యైవాభావాత్ - తస్మాత్కలియు
గేబ్రాహ్మణేన విధివదూఢాయాముత్పన్నఏవ బ్రాహ్మణః సఏవ
షట్కర్మాచరణయోగ్యఇతిసిద్ధం-ననుజన్మనాజాయతేశూద్రః కర్మ
ణాజాయతేద్విజః వేదపాఠేనవిప్రస్స్యాద్బ్రహ్మజ్ఞానేనబ్రాహ్మణఇతిస్మ
రణాత్ బ్రాహ్మణేనబ్రాహ్మణ్యాం విధివదూఢాయాముత్పన్నో న
బ్రాహ్మణః కింతు శూద్రఏవేతిచేన్నైవం - కింసర్వేమనుష్యాజన్మ
నాశూద్రాజాయంతఇతితవవాదః ఉతకతిచిత్ -నాద్యః చండాలాదీ
నామపి శూద్రత్వాపత్తేః - ద్వితీయేపి - కింశూద్రాయాముత్పన్నా
ఏవశూద్రా యద్వా క్షత్రియస్త్ర్యాదిషు - ఆద్యేబ్రాహ్మణ్యాంజాత
స్యనశూద్రత్వం - ద్వితీయేతు వ్యవహారవిరోధాదిః - నచైవంశూ
ద్రాపుత్రశ్శూద్రఏవ బ్రహ్మజ్ఞానేన బ్రాహ్మణస్స్యాదితివాచ్యం య
దిశూద్రాపుత్రః కర్మణాద్విజస్స్యాద్వేదపాఠేనచ విప్రస్స్యాత్త
హిజ్ఞానేనబ్రాహ్మణోపిస్యాన్నతుతథా దృశ్యతే - కింతర్హి బ్రా
హ్మణ్యాముత్పన్నఏవ జన్మనా శూద్ర శ్శూద్రసమః కర్మాభావా
త్ కర్మణాతు సఏవద్విజః తస్యైవకర్మాధికారార్హత్వాత్ - వేద
పాఠేనచ సద్విజఏవవిప్రః జ్ఞానేనతు సవిప్రఏవబ్రాహ్మణఇతికృత్వా
బ్రహ్మజ్ఞానప్రయుక్తంబ్రాహ్మణత్వమపి బ్రాహ్మణానాం

బ్రాహ్మణస్యైవ నాన్యస్య ద్విజత్వవిప్రత్వాదితి బోద్ధవ్యం - నను
యది జన్మనైవ బ్రాహ్మణ్యాం బ్రాహ్మణా దుత్పన్నో బ్రాహ్మణస్త
ర్హి కథం తస్య పునః బ్రహ్మజ్ఞానేన బ్రాహ్మణత్వం పిష్టపేషణాద్విరో
ధాదితి చేదుచ్యతే- పుంలింగో నపుంసకలింగశ్చేతి ద్వివిధస్తావద్బ్ర
హ్మశబ్దః - తత్ర పుంలింగాద్బ్రహ్మ శబ్దాచ్చతుర్ముఖవాచకా జ్జా
తావాచ్యాయాం బ్రాహ్మణశబ్దో నిష్పన్నః - సచదర్శితః - క్లీబాద్బ్ర
హ్మశబ్దాత్పరబ్రహ్మవాచకాత్ జ్ఞానేవాచ్యే నిష్పన్నో బ్రాహ్మణశ
బ్దోఽన్యః - నాత్ర బ్రాహ్మోఽజాతావితి సూత్రప్రవృత్తిః పుం
లింగబ్రహ్మశబ్దస్యైవ తత్ర గ్రహణాత్ -సవ తావాన్వేదేషుసర్వే
షు బ్రాహ్మణస్య విజానత ఇతి గీతాభాష్యే శ్రీశంకరాచార్యైర్దర్శితః
బ్రాహ్మణస్సన్న్యాసీతి - విదుష ఏవ సన్న్యాసాధికారా త్సన్న్యస్తస్యైవ బ్ర
హ్మజ్ఞానిత్వాచ్చ బ్రాహ్మణో బ్రహ్మజ్ఞాని సన్న్యాసీత్యర్థః - నచక్షత్రి
యాదీనాం సన్న్యాసాద్బ్రహ్మజ్ఞానలాభే బ్రాహ్మణత్వం స్యాదితి వాచ్యం
బ్రాహ్మణోనిర్వేదమాయా దిత్యాదిశ్రుతేర్బ్రాహ్మణస్యైవ సన్న్యాసా
ధికారాత్ తస్మాత్ జాత్యా యో బ్రాహ్మణః స ఏవ కర్మాచరణాది
నా ద్విజత్వాదికం సంపాద్య జ్ఞానేనాపి బ్రాహ్మణో భవతి నత్వన్య ఇతి కృ
త్వా న పిష్టపేషణవిరోధః - నాపి శూద్రాదీనాం జ్ఞానేన బ్రాహ్మణత్వా
పాతః - వజ్రసూచ్యుపనిషత్తు క్రియావాచినం బ్రాహ్మణశబ్దం ప్రగృ
హ్య బ్రాహ్మణత్వం న జాతిరిత్యుక్తవతీ - నతు జాతివాచినం బ్రాహ్మణ
శబ్దం - తథాసతి శ్రుతిస్మృత్యాదిబహువిరోధేన వజ్రసూచ్యుపనిష
దోఽప్రామాణ్యప్రసంగాత్ - తథాహి - వేదవిది బ్రాహ్మణేవసంతి
బ్రాహ్మణోఽస్య ముఖమాసీత్ బ్రాహ్మణో నిర్వేదమాయా దిత్యాది
శ్రుతయః - గర్భాష్టమే బ్రాహ్మణముపనయీత బ్రాహ్మణస్య ధనం
భైక్ష్యం - బ్రాహ్మణక్షత్రియవిశాం స్వభావప్రభవైర్గుణైః ఇత్యా
ద్యాస్స్మృతయః పురాణాదీని చేహానుసంధేయాని -వ్యవహారస్తు
సార్వజనీనః ప్రత్యక్ష ఏవ బ్రాహ్మణోఽయం క్షత్రియోఽయం వైశ్యో
ఽయం శూద్రోఽయమిత్యాదిః బ్రాహ్మణశబ్దో జాతివాచీహి సర్వలోక
విదితః క్షత్రియాదిశబ్దవత్ - జ్ఞానవాచీ బ్రాహ్మణశబ్దస్తు విద్వద్వ్య
వహారమాత్రగోచరః నసార్వజనీన ఇతి సర్వమవదాతం.

ఇతి బెలంకొండ రామరాయకవికృతిషు బ్రాహ్మణశబ్దవిచారః.

వారు నేయభామ్మణీకులని భామ్మణులనుంచి వేధాలుతీసిమనకుభామ్మణీకం తాపటంచేయించి ఆరివల్లమునకు పూజలుచేయించ మొనక యిరణ్యాచ్చుడి పొట్ట సీల్చి ప్రగలాదునిరచ్చించినట్టి వరహావతారమోలె వదబట్టి భామ్మలను పతిగామంలో వరహావతారమై భామ్మలపురుగేర మొతికిమొతికి నాశనం చేయబుట్టిన అవతారపురుసుడు సాచ్చాత్తు

నాగే। పారాశాస్త్లగారూ తెలియక అడుగుతుండా యేదాలు చాత్రాలు పురాండాలు బామ్మలకాడవుండేయివదలకొట్ట రంటుండారే ఆయేదాలు చాత్రాలు పురాండాలుశాతాళమా పోతా ఉకాట ఇనుమూకంచా యిత్తడా మనకాడఉన్న కొరముల్లింటాంటివి సమ్మోట సుత్తి కారు నీరుకారుకొలిమిలోబెట్టి జిరి) కాక రానిచ్చి పెద్దసమ్మెటేటున నాల్గుపీకులు పీకితే యీచాత్రాలు యీవేదాలు మనంచెప్పినట్టు సాగిరానంటండీ సాగదీసి కమ్మెచ్చునలాగి బామ్మలవదబట్టాల్చిందే యింతకాశికొచ్చిందాబామ్మలపని కొరముల్లేడుండయిఆసచ్చినోల్లకే(వాచిన చుట్టను కుంపటిలో సినిప్పను నీరుకారుతో అందుకొని కాల్చును)

పేరా (తనలో) పేరేమిచెప్పినను నోరుమూసుకుని పూరకుండ కున్న నాబామ్మల భరతమెట్లున్నను ముందునాభరతము. సుత్తెవేటులనామత్తునచి - సుత్తెమింటలను సార్థక పరుచుకొందురు - యిట్టిజ్ఞానసూన్యులజ్ఞానవంతులజేయ వలయుననియు బ్రాహ్మణీకులకన్న అతిశయులజేయవలెననియుకంకణముబూని పాటుపడుచున్న మాంబోట్లయు నిరర్థక శాస్త్రుల్లవారి యొక్కయు ప్రయత్నయు శ్వానవాలమును వంకరతీర్చి బద్దలుకట్టినరీతి నిరర్థకమేయగును

(మల్లయ్య) - శాస్త్రిగారూ. బొమ్మలు మనకంటే యేయిస యూరమెక్కువ కాగల్రాసు మొన్నమన పారోతు పున్నాజా చిగుడ్లరిక చూసింపు - చూసేతల్కి నాకు మండుకొచ్చి నీవే బాపనాయన ననుకుంటావా? మేమూ బొమ్మ్లకంటె తెచ్చు కుంటుండాము యేదాలు చాత్రాలు పగలకొట్టే మొనగాడు మాగో మొలిసిండనేతల్కి ఆ బాపనాయితే నీవెట్టాబొమ్మ డవురా అన్నడు-అనేతల్కి వరుప్పుడు రాయి మరిచొచ్చి ఆప రుగెలగూడోలి వసుపుడు రాయి యాడమెతికినా సమయా నికి గావరాకపోయె యీ తూరి వాడిబొమ్మడి తలంనా బొమ్మ జితపంన గ పుడురాతిన వనిసి మైనాద్ది వుంచితినా గోగంకుడుగతది.

కోటి. మల్లయ్యా శాస్త్రి - నీవు మూలంగనుకో లేదే- మొన్న అగ్రహా రీకుడు చాత్తుర్ల గారికినాకు వాదంపడి వాదిచ్చుకోటంలో బొ మ్మలంటూ ఇరిల్లల్లో అగ్నిగోత్రాలు తియ్యకుండా వుంట యిఅంట - అందుకని ఆరుమనకంటె యెక్కువంట అందుకు నేను చెప్పిన్న పొద్దున్న లెగిసినాలనుంచి గోజుకి అరవైశెపు పాగాకు చుట్టలకైద్ది యెడతెరిపిలేకుండా అగ్గిచుట్టలరాత్తుం టది పొద్దుగూకులూ కుంపట్లో బొగ్గువేసి బుగ్గలుతీపులెత్త కుంపటి వూదేది వూదేపాలంగానే వుంటుంటది మాయింటి కాడా కొలిమికాడా యేపొద్దుఅగ్నివూత్తానెవుంటా రెమాకం టె మీయిండ్లకాడ అగ్నిగోత్రాలుమహాలావా మీరు మా కంటెయెక్కువబొమ్మలెట్లైనరు. బాగాజాడిచ్చిడిగినా?

నాగే॥ జాడిచ్చి అడగాల్పిందే బాపనపోరగాండ్లు ట్టిపడుతుండారే చేలకాడా సెట్లకాడా బహుయజ్ఞానంసాగిచ్చారు ఆళ్ళకు మట్టుకు మహాలావుజ్ఞానంవుండదా మనబమ్మంగారి కాలజ్ఞా





# లక్ష్మీవిలాసము.

## ప్రథమాశ్వాసము.

శా॥ శ్రీలన్ మించుగ మావిలాస మతిమైత్రిం జిత్తకంజంబునన్
దా లేఖ్యాకృతిఁ గాంచి చొక్కు రుచి బాహ్యంబందనాఁ బేరెదన్
లాలిత్యంబులు జూపు సింధుజ నవేలక్రీడలందున్న నా
లీలాబ్రహ్మము శేషశైలపతి బాళిం బ్రోచు మమ్మెప్పుడున్॥ ౧

సీ॥ భాస్వదుత్పలహేతప్రకటదృగ్గరిమతో దృఢతటిద్ఘనదేహదీప్తితోడ
గురుజీవనగ్రాహకుండలరుచులతోఁ బటుసువర్ణవిచిత్రపటముతోడ
విమలముక్తాహారవీక్ష్యమండనముతో శ్రీనరనామసంసిద్ధితోడఁ
శతసహస్రారాబ్జయుతకరక్రీడతో విపులాభరణకళావృత్తితోడ
నాత్మవిలసనపతిరూఢిననతిశయిల్లు । నిందిరాదేవి హృదయారవిందపీఠిఁ
దగముకొనఁ జొక్కు వెంకటాద్రిఁ పుడుమమ్ము బూర్ణ సకలేష్టదాయియై ప్రోచుఁ గాత॥

సీ॥ కమనీయమృదుపదాగ్రములఁ గచ్ఛపశీల మంజుజంఘల సాంద్రమకరభూతి
కరయుగంబున శుభాకారమహాపద్మాప్తి వలుఁదచన్నులపరాదలవిభవము
కంఠదేశమున నఖండశంఖసమృద్ధదంతపంక్తులఁ గుందకాంతిమహిమ
యాననమందుఁ బద్మాహితసంపద యలకాళి నీలైకవిలసనంబు
నాస్ఫూర్తి ముకుందవీక్షణీయాభమొలయ । నవనిధానప్రధాన సౌందర్యరేఖ
నలరి కలశాబ్ధిఁ బొడమిన కలిమికొమ్మ । స్థిరకృపాదృష్టి మమ్ము రక్షించుఁగాత॥ 3

చ॥ పరిణయవేళ సాక్ష్య తనపాదము లీక్షణకైనంబు లక్ష్మీ
నరపతి బూజసేయఁ గరుణన్ సతి కర్ధశరీరమిచ్చి త
ద్గరిమ సునామహేతులవఁ గా నుతిఁగాంచుపురాణసంపదల్
సరసతమాగుణీవుతఁ బ్రసన్నమతిన్, సకలేప్సితార్థముల్ ॥ ౪

ఉ॥ ఆగమముల్ ప్రసిద్ధి వెలయన్ స్వరయుక్తముగాఁ బఠింపఁ జో
వాగలిపే.శ్రీ తత్పరఁ శివర్ణపదక్రియరూఢిఁ జొప్పడన్
బాగుగ నర్తనంబు సలుపన్ సముఖాప్తి నహించి మించు మే
ధాగురు నబ్జసంభవు ముఖంబునఁ గొల్తు నభీష్టసిద్ధికిన్ ॥ ౫

సీ॥ కలితసువర్ణసంగతిఁ నొసంగుటె కాదు కలితసువర్ణసంగతి నొసంగు
సముచితాలంకారసరణి మించుటె కాదు సముచితాలంకారసరణి మించు
శోభితపదరసస్ఫూర్తిఁ గాంచుటె కాదు శోభితపదరసస్ఫూర్తిఁ గాంచు
నుత్తాలశబ్దసంయుక్తిఁ బొల్చుటయె కా దుత్తాలశబ్దసంయుక్తిఁ బొల్చు
లలితసంగీతసాహిత్యకలన నంగ । కళలఁ దగు దివ్యమంజీరములు ధరించి
మించు వాణి మదీయజిహ్వాంచలమున । నించు వేడుకలో నటియించుఁ గాత॥ ౬

హరిహరబ్రహ్మలకును లక్ష్మీగౌరీసరస్వతులకును నర్థమిచ్చెడి పద్యము

సీ॥ ధృతికమలామోద వృత్తి తేజము నంటి ఘనసారహేతుభూతి నుతిఁ గాంచి
రాజితానంతభోగగణ కళాయతి మించి యర్ధునపత్రి హృద్యగతి నలరి
ఫలితసత్యాగమా కలితహర్షముఁ జెంది సుమన స్సముదయభావము నెసంగి
బహుముఖాలంకారపదరూఢి విలసిల్లు జడదారి కోమరుముచ్చటలఁ దనరి
ధాత్రిఁ బొగడొందుచును గుణత్రయవిభాగ । మూర్తులై వన్నెకెక్కు త్రిమూర్తులనఁగ
మీరు శ్రీపార్వతీ భారతీరమణుల దీనజనసారమతులఁ బ్రోవఁ గాంతు మదిని॥ ౭

ఉ॥ ఆదరమొప్పనంబ కళలన్నియుఁబుద్ధులఁగూర్చి వెన్నఁతో
బోరిదిగఁగుక్షినింపఁ గడుపుంబలవుష్టినిబిక్కటిల్ల లం
బోదరుఁడై శివాభవులకొయ్యన ముద్దులఁజూపు నుజ్వల
న్మోదకహస్తు హస్తివదనుం గణనాయకు సన్నుతించెదన్ ౮

మ॥ నృపుఁడౌరాముఁడెదైవమంచు శపథోద్వృత్తిం దదర్థంబు వి
ష్ణుపదం బుద్ధతిమట్టి బాడబగరిష్టుందాటి క్షేమాప్తి నా
విపులాభర్త నుదారయుక్తిఁదనరన్ వేమారుఁగీర్తించు ధీ
నిపుణున్ భూతనయార్తినిర్వహణు వర్ణింతున్ సమీరాత్మజున్ ౯

—హరిహరహనుమదాదికవిస్తుతి—

సీ॥ వనచరవంశపావనమూర్తియగువాని ముఖ్యాగమోద్ధరణాఖ్యవాని
మహీవరాహస్వామివిహితానుగతివానిఁ దులలేనిసటలఁ బెంపొలయువాని
మృదుపదక్రమసమర్థితరసోచితివాని బాణప్రభావాప్తిఁబరగువాని
త్రిగుణాత్మకప్రౌఢితేజమందినవాని హంసరుద్యతరూఢి నమరువానిఁ
గలితసుప్రతభారవిఖ్యాతివాని- గరిహననధన్యకీర్తినాకలననొప్పు
వాని వినుతింపుచు నొనర్తునందనములు వరుసవందప్రణామపూర్వకముగాఁ గ ౧౦

కం॥ శుంభచ్చతురాననసుత గుంభితరసవాగ్విలాసగురువిభవముతోఁ
బుంభావసరస్వతులన గంభీరతఁదనరు నాంధ్రకవులనుతింతున్ ౧౧

వ॥ అని యిష్టదేవతాప్రార్థనంబును సుకవికీర్తనంబునుం గావించి యమందా
నందలోకలోకబంధుసందర్శనానంద దరదరవింద స్పందిమకరందరస బంధురంబగు
నొక్కమహాప్రబంధంబురచియింపఁబూని సకలేష్టదాయకుండగుకృతిపతి నన్వేషించు
నెడ ౧౨

శా॥ శ్రీమద్దైవభవభావ్యపంకజభవశ్రీకంధరేంద్రామరుల్
రోమాంచాన్వితగాత్రులై యెదుట బారుల్దీర్చిసేవింపఁ ద
ద్ధామానుగ్రహయుక్తి లెమ్మనుగతిన్ శ్రీహస్తముల్ జూపు శ్రీ
భామాసక్తుఁడు వెంకటేశ్వరుఁడు స్వప్నప్రాప్తుఁడై యిట్లనున్ ౧౩

కం॥ పరమతినుపియించితి మ ద్వరమున నటుగాన నీవువర్ణించుకృతీ
శ్వరుఁడనయి పరములొసఁగెద గరిమన్ లక్ష్మీవిలాసకథఁ జెప్పఁదగున్ ౧౪

తే॥ అని ప్రియారసస్ఫూర్తితో నభయమొసంగి కృతియొనర్పుము నాపునంకితము గాఁగ
నత్సదీర్ఘాయురస్తు భవ్యాగతిసీవు ననుచుదీవించె నంత నేనద్భుతముగ ౧౫

క॥ మేలుకొని స్వప్నలబ్ధపు మేలు సుధీజనులతో నమృతసారపు మల్
జాలుకొనఁ దల్ప నెన్నఁగఁ జాలున్ఫ్రతార్థుపనను ము సంభ్రమపరులై ౧౬

మ॥ సెలుగో క్తిన్ ననుజూచియిట్లనిరి వత్సా నీవు గావించు స
త్కృతి శ్రీ వెంకటభ క్తకీఁగనుట యొంతే పూర్వజన్మాంతరో
ర్జితపుణ్యాంబునఁగాక కల్గునె యశశ్శ్రీ కైహికా ముష్మిక
స్థితికర్తం గృతిభ క్తఁజేసి కను సుస్థేమాయురారోగ్యముల్ ౧౭

క॥ సకలాశ్రితసత్యనిర్వా హకుఁడనిజనులెన్న వెలసితౌ ధరఁ గర్ణా
టకరాజసభల నిష్కళం టకముగ రాయసము వెంకటపతీ సుకృతీ ౧౮

మ॥ అలఘుప్రాభవగర్వభూపర్కతుపశాహా మేయసైన్యంబు న
గ్గలికంబంపుల చేత గెల్చి బిరుదుల్ గైకొన్న శ్రీరంగరా
యలచి త్తంబిగురించ రాయసముద్రాయుం జాలి తౌనా సుధీ
తిలకుండెవ్వఁడియమంత్రి వెంకటపతీ దీవ్యత్కళావాప్తిపీ ౧౯

క॥ ప్రతిపద్యశిగకంపము ప్రతిపదచిత్రార్థగోచరము ప్రతివాక్య
స్థితి రసబంధురమైయలరుఁ న్నతిఁగాంచఁ బ్రబంధ మీవొనర్పుము హరికిన్ ౨౦

వ॥ అని మదీయాభిప్రాయానుగుణ్యంబు గాఁ పద్దయుంబ్రీతిఁ బెద్దలునిర్దేశించి నానాశంపరసతరంగంబులనోలలాడుచు మత్కులదైవంబగునద్దేవునుద్దేశించి నమస్కరించి భక్తియుక్తంబుగ నేతత్ప్రబంధ ప్రారంభసంరంభధురంగరుపనై తనరునస్మదీయవ ర్తనం బెట్టిదనిన

శా॥ శ్రీలక్ష్మింమసమగ్రభీకళలచేఁ జెన్నొందునాత్రేయనం
శాలంకారకరుల్ వసిష్ఠమునిగోత్రాంకుల్ బుధుల్ దీనర
క్షాలీలన్ బొగడొందిరందు వెలసెన్ సన్మానిభానుప్రది
ష్టాలోద్వేలవిశాలకీర్తుల సుధీసందోహమందారుఁడై ౨౧

చం॥ అతనికినుద్భవించెసుగుణాంబుధి తిమ్మయమంత్రిపుంగవుం
డతఁడతివై భవున్ నరసయప్రభుఁ గాంచె నతం డుదారతా

యతగతి విఠ్ఠలార్యుఁ గని నాథునుఁ డప్పయమంత్రిశేఖరున్
సుతునిఁ గాంచె నానరయశోనిధికిన్ మహిఁ నేనుగఁ గీర్తిన్ ॥ ౨౩

క॥ మఱి శ్రీనివాసమంత్రియు సిరులన్ రామప్రధానిశేఖరు లుదయిం
చిరి వారికగ్రజుండై ధరఁ దనరుచు సత్యదానగతాధికగరిమన్ ॥ ౨౪

ఉ॥ వారియను రాజ్యవైభవధురంధరభూతి సలిర్పఁ గీర్తిఁ ధౌ
రేయుఁ సిరంగరాయమహిభృన్మణిరాయస మగ్రహారహే
మాయతరత్నభూషలు నృపాఢ్యులు వర్తనలీయఁ జుబ్బచున్
వేయననేమి రాయసము వెంకటమంత్రియనా యశస్వినై ॥ ౨౫

క॥ ఈలీల నెసఁగి విభవా । హాలంబగు వెంకటాద్రివల్లభు కరుణన్
శ్రీలం జెలొందుచు ధర । నా లక్ష్మీరమణు గుణముల న్వినుతింతున్ ॥ ౨౬

శ్లోకము.

శా॥ సంగత్తుంగపతర్ఝురీతటనటచ్ఛకారిగరంగద్గిరు
ద్గాంగేయద్యుతిపుంజరంజితదరీధాతుప్రభామేదితే
శృంగే పన్నగరాణ్ణగస్య రమయా క్రీడంతముద్యాంఛయా
శృంగారాంగదసంగతాంగమనిశం శ్రీవెంకటేశం భజే ॥ ౨౭

సీ॥ వికచపంకజగళన్మకరందలీలఁ బూర్ణకటాక్షములఁ గృపారసముఁ జింద
మృదులప్రవాళబింబితసముద్యుతిపోలి యధరంబుపై మందహాసము మెఱప
హృదయనిర్వ్యత్సంగతేందుబింబవిభూతి సుభగవక్షమునఁ గౌస్తుభమె సంగఁ
దితకోకనదసమాకృతరథాంగస్ఫూర్తిఁ జరణాగ్రరత్నహంసమ్ములారయ
సరసనంజాతసురనదీఝరివికాస । పూరితాంగుష్ఠనఖకాంతి పారనిగుడ
శ్రీసమాహితమూర్తియై సిరులఁ దనరు । వాని శ్రీవెంకటాచలస్వామిఁ దలతు ॥ ౨౮

మ॥ తను సేవించుజనాళికిం గరుణ సిద్ధాత్రిన్ మనోవాంఛలె
ల్లను బూరించుననంచు లోకులకు నెల్లం దెల్పఁ బ్రత్యక్షమై
జనసంఘంబుల నిందిరమ్మనుచునో జంబిల్చున ట్లాశ్రితా
వనహస్తాబ్దము జూపు వెంకటనగస్వామిం బ్రశంసించెదన్ ॥ ౨౯

మ॥ పగలున్ రేలొనరించు గందళుకులన్ భావింపుచున్ సుప్రస
న్నగతిన్ భక్తమనోనుహాల్పలము లానందింపఁ జంచత్కృపన్
బగలున్ రేలన కీప్సితంబు లొనగూర్పం జాలు నాశంఖచ

స్రగదానందకశార్ఙ్గహస్తు ధృతరాగగ్రస్తుఁ గీర్తించెదన్ ॥ ౩౦

షష్ఠ్యంతములు.

కం॥ ఈదృగ్గుణమణిహారున । కాదృతలక్ష్మీశ్వరునకు నోబిహారున కజరా
మోదననరఖాదనపర । ఖేదకరసౌరుసకుఁ । సుధృద్ధారునకున్ ॥ ౩౧

కం॥ కరకలితవలయ హేతికిఁ । గరుడాధసపుషితపురవిభూతికి దివ్య
చ్ఛురణానతశరణాగత । భరణాతతకృతికి మోక్షఫలదాకృతికిన్ ॥ ౩౨

కం॥ పత్రరథపత్రికుండా । పత్రియదాత్మనను ఖండపరశుకళత్ర
స్తోత్రగుణపాత్రిసరమప । విత్రచరిత్రునకు సవితృవిధునేత్రునకున్ ॥ ౩౩

కం॥ సహానజహంస్గహనవహ । గ్గహానమహాత్వఖ్యాతిభృతికిఁ దాపసజనహృ
గ్గహారవిహరత్స్వతేజో । గ్రహపతికిం దుర్హిణముఖవరప్రదమతికిన్ ॥ ౩౪

కం॥ శ్రీవనితాజీవనతా । భావనతాదుర్గ్యామతికిఁ బదధాటీసం
జీవితదృషదాకృతికిన్ । శ్రీవెంకటపతికి ఫలితసేవాకృతికిన్ ॥ ౩౫

వ॥ అంకితంబుగాఁ బొంకిపంబూనిన రమావిలాసంబను రసవత్ప్రబంధం బెట్టిదనిన॥ ౩౬

కం॥ శ్రీరమణీశకధామృత । సారము నందనిపిచనక జనమేజయుఁ డి
ఛ్ఛారతి వైశంపాయన । సారయతిన్ జూచిపలికె సవినయమతియై॥ ౩౭

సీ॥ అనఘభారతమునం । దాదిపర్వంబున దివిజులంభోధి మథించుటయును
సరసిజాలయ యందుజనియించుటయును బెంపలరంగ నేను మునులవలనవింటి
మునుపదిసంకోచముగఁ బల్కితిరిమీరు గావున నీకథాత్రమనువినఁగ
పేడుకయ్యెడునాకు విబుధులేరీతి మందరమును నంబుధిఁ ద్రచ్చి రందు
శ్రీమధురవాణి జనన మేరీతినడచె । నప్పుడు హరియెట్లు పరిణయంబయ్యె నదియుఁ
నానతీవలె నన్నుహర్షాదరమతి । జనపతికిఁ దెల్పఁ దొడఁగె నా మునివరుండు॥ ౩౮

కం॥ అమరవరులందరును దివ । కమరత్వము బలసమృద్ధి యారోగ్య శ్రీ
లసురఁగయోజన లధికని । యమరత్వఁగొని యమృతలబ్ధి యగునిదియరుచున్ ॥ ౩౯

చం॥ కులగురుఁడౌ పితామహునకుం దెలుపందగునిట్టికార్య మ
య్యలఘుఁడు నిర్వహింపగలఁడంచుఁ బురాణపురస్కృతంబుగాఁ
బలుకులకోర్మ నేఁడుదొరపాలికిపేచని భక్తియుక్తులై
పలగొనిపంపనఁబులిడి వాంఛితముల్ దెలుపన్ వినెంచిరయున్ ॥ ౪౦

క॥ సనకాదివంద్యుఁ డగునా । కనకాచలధృతికి స్వామికిఁ గాఁ గనే యీ
ఘనకార్యనిర్వహణమని । జనకామదుఁ జక్రిగాంచి సంభ్రమపరుఁ డై. ౪౧

క॥ తామరసభవుఁడు భవము । ఖ్యామరసభగోల్వఁ జెల్వమరుహంసగరు
చ్చామరసమితివనర హరి । సామునసన్నుతిఁ జేసి తనలినుఁడగుమర్॥ ౪౨

శా॥ వేవేగంజనుదెంచి చిత్రమహిమావిర్భూతసత్కీర్తిఁ ము
క్తావిభ్రాజిదిశానిశాకరముఖీకంఠోపకంఠంబునా
శ్రీవైకుంఠపురంబుఁ జేరి దనుజారిఁ శౌరిసేవించి యా
దేవానీకముఁ రాక వీక్ష మితనూక్తిఁ భక్తితోఁ దెల్పినన్॥ ౪౩

క॥ పవిధారిముఖామరు లుచి । తవిధానం బెసఁగఁ జక్రిధరుఁ బొడగని యా
రవిధాముఁ వినుతిఁ జేసిరి । వివిధాగమసూక్తములను వినయాన్వితులై. ౪౪

సీ॥ దండంబు శార్ఙ్గకోదండపాణికి నమస్కారంబు నళినవిహారునకును
వందనం బాశ్రితనందనంబునకు జోహారు వేదాంతవిహారునకు
సాష్టాంగ మానందతుష్టాంగునకుఁ సుప్రణామంబు తతకరుణామయునకు
వినతి పాతకమీనఘనతిమింగిలునకుఁ గేలుమోడ్పు విచిత్రఖేలునకును
దేవ ప్రాంజలి నీకు భూదేవవినుత । సవనభోక్తలమము సారసవనసీమ
కరుణఁ బ్రోవు లెరక్షింపు కరుణఁ బెంపు । జీవనదనీలగాత్ర రాజీవనేత్ర॥ ౪౫

గుచ్ఛబంధము.

క॥ నరదరవరమురహరవర హరిహరనుతనతవితరణ యాగమగణ్యా
శరధరనరవిలసవసర సరసనలినవనవిహార సారశరణ్యా ౪౬

గోమూత్రికాబంధము.

క॥ సుమశరమూర్తిదయాపర కమలేశకమనవినోద ఘనరాజదరీ
హిమకరకీర్తిజయాకర విమతాశరమదవిభేద వినతాజహరీ ౪౭

చక్రవాళబంధము.

క॥ చరణానతజనభరణా భరణాసహశత్రువిజయ భద్రాంకిరణా
కిరణాయితరవిశరణా శరణాగతరక్షణైకసంధాచరణా ౪౮

క॥ వృత్రాశరజిత్ప్రముఖులు సత్రాశనులనఁగ వినఁగజాలక శుభచా

రిత్రా శరణనిరోధము ప విత్రాశన మమృత మొసఁగవే జగదీశా ౪౯

వ॥ అని

కం॥ తానని విశేషభక్తస్థ్య త్తానని యతిమైన దితినితంబవతీ సం
తానని నయమునుతించగ తాననిలాభర్త యేకతానప్రీతిన్ ౫౧

కం॥ వారలఁ గనుఁగొని గ్రాక్షా వారలఘుర సాతి వేల వాఙ్మయపారా
వారాలహరులం గ్రుప ద్రై వార లలిం దేల్చి జగదవనుఁ డిట్లనియెన్ ౫౨

తే॥ ధృతిని గావింపఁగలరేని హితముఁ బూని వినుఁడు వినుపింతు నొకమాట మనసు వాట
వరగుణంబులఁ బొగడొందు వార్ధియందు సకలవస్తుప్రపంచంబు ఘమధికంబు ౫౩

కం॥ భ్రావంబలరగదివ్య గ్రావంబగునట్టి మందరము కవ్వము గాఁ
గావించి యబ్ధిఁ జరునన్ జీవనముగ నమృతము చటుఁ జేసురు మీకున్ ౫౪

మ॥ పొడమున్ మెండియు దివ్యవస్తునిచయంబున్ వాంఛలీడేరఁగాఁ
గడలిం గావున నట్టి ప్రయత్నము ధృతిం గైకొందు మీరంచు నే
ర్పడ విష్ణుండు హితోపదేశ మొనరింపన్ వల్లెయంచున్ ముదం
బడరం బొంగి సురాసురాధిపులు తత్ప్రారంభమునుంపఁగన్ ౫౫

కం॥ శంకరి దేవుఁడు జూచిన శంకరగతి నిట్టులని యొజ్రకిని భవ
త్కింకరవరులగు వీరలు కింకర సాధింతు రెట్టి కృత్యము నుహరీ ౫౬

సీ॥ ధీరులై శరధిగంభీరులై ప్రబలదోస్సారులై యాశాధికారులుండ
మేటులై బలుధైర్యపేటులై పటుజైత్రధాటులై దైతేయకోటులుండ
గణ్యులై త్రిజగచ్ఛరణ్యులై విపులకారుణ్యులై సుమనోవరేణ్యులుండ
దక్షులై సురకశాఘ్యదక్షులై రుచిజగచ్ఛక్షులై గంధర్వయక్షులుండ
నోరమాజాని వైషమ్యయుక్తిమాని వీరుభరదాజ్ఞ నూని కావింపలేని
పనులుగలవయ్య యెందేని యనుభవాని విభునిపలుకులు చెవియాని వేడ్క బూని

కం॥ కావింపుడీ ప్రయత్నము రావింపుడు సకలజనులఁ బ్రార్థనతోడన్
సేవింపుడు గణపతి సం భావింపుడు పూజఁ జేసి మందరనగమున్ ౫౮

కం॥ అనివారణావరదుఁడు దా । నని వారణగరిమఁ బలికి యదనన్యమెగు



# కంసవధము.

## తృతీయాంకము



[అంతట రథారూఢుఁడగు నక్రూరుఁడును సారథియును బ్రవేశింతురు]

అ— (పొడవుగా వేడిగా నిట్టూర్పు విడచి) అక్కటా

సీ॥ సంసారమీక్షింప సంతాపహేతువే కాని సార మొకింత కలది కాదు
రాజభోగముఁ జూడ రహి విషంబునఁ గూడఁ గర మెచ్చుతగ్గు పాకంబు కలది
జీవితముం గాంచ స్థిర స్వతశ్చపలమై యమధర్మరాజుచే నావృతంబు
దేహముం గనుగొన్న దినగండములతోటి నిశ్చితాపాయమై నెగడునదియ
యీ మహాభాగ్యమునకునై యెన్నొ పాట్లుఁబడి పరప్రాణముల్ దీసి ప్రాణములను
బోషణముఁ జేయుదురు దుష్టబుద్ధులహహ। విషయములలోపలం జిక్కి వివశులగుచు

ఆహా! యేమి యీ రాక్షసకుల కళంకుఁడగు కంసుని జ్ఞానహీనతయు దయాశూన్యతయు

చ॥ చెలియలినూను లేడ్గురను జెల్లుట కేడ్వ డొకింతయున్న దుర్
వలవల యేడ్చు నెన్మిదవవాఁడిపుడే మొయొనర్చునంచు ద
న్నిల్లఁదన చావుకే జననమెత్తిన చోహరి త్రాతయెవ్వఁడౌఁ
గలుగదె చావు ప్రాణులకుఁ గల్గిన మోక్షము కాదె శౌరిచేన్ 2

(విమర్శించి) అతిదారుణమైన రాక్షసభావమవలంబించియున్న యితని నేల దూషించవలె నాలాటి నీచకృత్యములోఁ జొరఁబడిన నన్నే నేననుకుందును.

చ॥ శిరమునఁ దాల్చి యాజ్ఞ నృపసేవ యొనర్చుచుఁ జాల శ్రద్ధచే
నెరుఁగ కకృత్యకృత్యముల నెంతయు ధర్మముపేక్ష సేయుచున్
గరుణ యొకింత లేక తృణకల్పముగా మది నెంచి లోకమున్
నిరతము పొట్టఁబోసికొన నేరుచుకొంటిని సిగ్గుమాలి నేన్ 3

సూ — ఆయుష్మంతుఁడా రాజుగారు మీకుమీకుఁగలచుట్టరికముగుర్తెఱిఁగియుండి యుఁ బిల్లవాండ్రైనరామకృష్ణులఁగోడితేనుత్త జాలిపేగులవాఁడవైన నిన్నొం దుకుఁబంపుచున్నాఁడు.

అ — సూతుఁడా కుటిలనీతిపండితుఁడగునీకంసుఁడు మాకుమాకువిరోధముగలుగఁజేసి సుందోపసుందులలాగున మేమందరమును దుడియవలెనని చూచుచున్నాఁడు.

ఉ॥ ఆసతిదాటనం దుననునాతఁడుచంపునుదోడితేనిచో
నేనటుదోడితేనుజన నెవ్వరునన్నసకంద్రు పాపిగాన్
సూనువియోగతాపమునసొక్కుచునందుఁడుతూలనాడునన్
బూనునుజ్ఞాతితాఁబగను బొక్కుచుఁ బ్రేతలుతిట్టిపోయుదుర్ 4

సూ — అయ్యా రాజుగారియాజ్ఞకులోనై విధిలేకయతికష్టముగావానిఁదోడ్కొని రా నటుబోయినమిమ్ము భగవంతుఁడగువాసుదేవుఁడు శత్రువునిగాశంకించఁడుకదా

అ — సూతా నిజమాడితివి.

చ॥ ప్రకృతము దుష్టనొద్దఁబని పాటలు సేయుచుఁగొల్చుచుండి చూ
డకపలునాళ్ళనుండియు నడంగినస్నేహముగల్గియున్న యె
న్నికగలయట్టిచుట్టమును నెమ్మదినమ్మఁడుతా మృగంబు పే
రోలబలువేటకానికడనున్నమృగంబునుబోలె శంకమై 5

అట్లైనను.

తే॥ సర్వసర్వాంతరాత్ముఁడై సర్వవృత్తు । లెఱుఁగుచుండెడిభగవంతుఁ డెవరి వేడ
కొక్కతనకాళ్లదిక్కని మ్రొక్కుచున్న । నన్ను మఱియొకరీతిగా నెన్నుకొనఁడు॥

సూ — ఆయుష్మంతుఁడా సాయంకాలమగుచున్నయది కావునఁ ద్వరఁజేయుఁడు రామ కృష్ణులదర్శనముఁజేసి నేత్రములు సఫలముఁజేసుకుందము.

అ — (క్షణముధ్యానించి హర్షముతో) అమ్మయ్యా కుర్రవాండ్రను బట్టుకొనివచ్చుట కాజ్ఞాపించునపుడు నాపైరాజుగారు జూపించినయాగ్రహముకూడ ననుగ్రహ ముగానే పరిణమించినది.

ఉ॥ చామనిచాయకల్గుకడుఁజక్కని మేన్ గనుదోయికింపుగా
రామునిగూడి మందకడరాజిలుదమ్ములనాఁచుచున్ బుధ

స్తోమముచే నెరుంగఁ బడుచున్న యవాచ్యపుబ్రహ్మ సారమున్
వేమఱుగాంతు గోపనటు వేషముఁ బ్రీతి సుధామయాంబుధిన్ 7

సూ— (పడమటికిఁజూచి) బాబూ అటుచూడు.

చం॥ మిగిలి ప్రపంచమందుఁగల మేటి వెలుంగుల ఘస్రమంతయున్
జగములనన్నిటన్ మనెడుజంతులకర్మలఁజూచిసాక్షిగాఁ
దగ రథవాజిచారుకలధౌతరజంబులనిండినట్టి మే
ను గలిగియున్న యుష్ణకిరణుండు పయోధిమునుంగఁజూచెడున్ ॥ 8

అ— (హర్షముతో) సఖా మంచిముచ్చటఁదెచ్చితివి.

చం॥ వనిఁబరుగెత్తుగోవృషభవారముకాళులనుండి పైకిలే
చినమృదుధూళిగప్పి కడుఁజిత్రిత మౌనును మేన వల్లెవా
టునిచిదుకూలమున్ వ్రజమునొద్దకుఁజేరెడివల్లవంటి నా
సూ— కను సఫలంబుగా నెపుడుకాంతునొ వెల్గులకెల్ల వెల్గునన్॥ 9

తే॥ అస్తమించుచుఁగూడనాయహిమకిరణుఁడస్తమయగిరిఁగ్రిసెసెమస్తమెక్కి
బుధుఁడు స్వార్థానపేక్షమైభువిఁ బరోపకారియౌఁదరుచుగావిపత్కలితుఁడయ్యు॥

అ— (బాగుగాఁజూచి యానందముతో)

తే॥ సూర్యకిరణంపురాగముల్ సోకి వింత । చాయమైనున్న మబ్బులచాలుదాల్చు
చుండునీకొండ చిత్రశిఖండములను । జుట్టుకొనినహరింబోలి సొగసుమిగిలె। 11

సూ—ఆహా! యెంతకార్యము

తే॥ ఉదయపర్వతశిఖరమందుండి ప్రజలఁ । గిరణములవేడి నేడ్పించి కీర్తినణఁసి
యన్యదిశకేగి తీవ్రమై నరుణుఁడిపుడు । కడలిలోఁబడిమునిగెఁగా కర్మవశత॥ 12

అ—సారథీ మంచియుత్ప్రేక్షఁజేసితివోయి

సీ॥ సంధ్యాగ్నిలోఁ బ్రవేశముఁజేసెదినలక్ష్మి వనజముల్ ముకుళించినసతిలేక
రయమ కాష్ఠాకరక్తిమజూపటె బాగుగానర్చిస్సుబలయుకొలది
భూమియు నాకాశమున్ నిండిపోయెను వడిఁ దమోధూమంబువ్యాప్తమగుచు
నెక్కడెక్కడిపక్షులేమియుందోచక మొరగి మహాక్షోభముంబొనర్చె
నంజలులుగ్రహించి యఖిలభూమీసురుల్ । నీళ్ళు విడచి రథికనియలివచ్చి
పడిసముద్రమందుఁబరలోకమేగ న । భాగ్యవశత లోకబాంధవుండు॥ 13

(మరలసూతునిగూర్చి) ఓయీ! చాలమార్గముగడచినది నందవ్రజ మింకను కొంతదూరమందున్నది

సూ—ఆయుష్మంతుఁడా! యిటుగా దగ్గర నేకనుపడుచున్నది కావున వచ్చితిమనియే యనుకొనుము- ఇదిగో చూడుమీ

చం॥ యమునదరింగలట్టి పొడవౌ నమ్రుసబ్బలి చెట్టచేరువన్
దమమను భ్రాంతిఁగొల్పు ఘనతాళవనంబులు పెక్కు—ధ్వాని లెన్
రమయిలు నందుపల్లెయును రాజిలె దానికిఁజాలదాపుగా
సమితలతమాలగుచ్ఛములనల్లినవల్లుల వెల్లితాంతమై॥ 14

అ—(బాగుగాఁజూచి వేగిరపాటుతో) సూతుఁడా! నాయూహవినుము

ఉ॥ భూధరశృంగమందు లలిఁ బుట్టినయీదులుఁగప్పి గాలు ద్యో
వీధిని గాలికింగదలు వింతధ్వజాంశుకముల్ గలట్టి యా
గోష్ఠము గక్షిపల్లె పులుగుల్ కదలించెడివృక్షశాఖల
న్సాక్షుకరంబులన్ మనలఁజయ్యనఁగోగిటఁజేర్పఁజూచెడిన్॥ 15

సూ—(కొంచెముదూరముపోయి వేగమునునటింపజేయుచు ముందరఁజూచి) ఆయుష్మంతా!

చం॥ ఉపవనవృక్షఖండముల నుయ్యాలలూగెడిపక్షిజాతులన్
రెపరెప విప్రసద్మములలోచెడి హోమపుధూమపంక్తులన్
జపలపశూర్ధ్వతంబులగు చారుపరాగములన్ గనుంగొనన్
విపులభయంబుగల్గెమది వి న్మిదియేమిటొ పర్వఁజీకటుల్॥ 16

(మరలవిషాదముతో) కటకటా!

ఆ॥ సూర్యుఁడస్తమించిచుక్కలు గానరాఁ। బొడుచుటకుహిమాంశుఁ డెదను సేయ
దక్షిణంబెజగముదయ్యపుఁజీకట్ల। నాకులంబునందెనకట మాదె॥ 17

మఱియును

పంచపాది

చ॥ చను నెడనస్తపర్వతముచక్కి శరీరముతాకి రాలిపైన్
ఘనపథి కాలియూరుపులగాలికి నెల్లెడఁబారజల్లియుం

ఉ॥ చప్పనసాలపైనఁబడి చన్నులొకించుకచీకి క్రొయ్యలన్
ముప్పిరిఁద్రాళ్ళఁగట్టఁబడి ముక్కుచుగుంజుకొనంగవత్సముల్
గొప్పఘటాంతరంబులనుగొల్లలుపిండెడిపాల చప్పుడున్
చెప్పెనుచూడవె గోష్టములచిత్రచరిత్రములన్నియీదెసన్ 24

సూ—(ఉత్సాహముతో) ఇప్పుడు

కం॥ హీంహీంయనియిగిలించుచు నోహోయనిస్వారిప్రోతలొగిఁజేయుచుఁగో
లాహలమొనరచబాలకు లాహాహా జసలువగిలె నరువఁగలేగల్ 25

అ— కావున నందఘోషముదగ్గరకువచ్చినట్లే గుఱ్ఱములపగ్గములుబిగఁబట్టుము రామకృష్ణులయడుగులచేఁబవిత్రమైనధూళిబారి మేనులుపవిత్రములుగాఁ, బాదచారులమై గాలిగోపురముచేరువనున్నఅన్నెపైనెక్కి నందనందనాగమనమునకై నిరీక్షింతము.

సూ—ఈయోజనబాగుగా, నున్నయది. కాబట్టి గుఱ్ఱములనిల్పినాను. తేరుదిగుదము
(అనిరథముదిగుటనటింతురు)

అ— (ముందుజూచి యుత్సాహముతో) ఓయీ యెక్కడివిది

తే॥ పంకజధ్వజరేఖలేర్పాటుగాఁగ నూరిచేరువయిసుకలోనుండెనడుగు
లెగుడుదిగుడుగనుంటచే నెవరొ యొక్క బాలకుండిప్డుసాకు జ్ఞాపకమువచ్చె

(ధ్యానమునటింపఁజేసి స్వ)

తే॥ యోగులతికష్టముననాత్మనుంచుచుందు రుపనిషద్వేద్యమైగ్రాలుచున్నదేని
నవనిలీలానరార్భకుండైనయట్టి కేశవుని యాపదంఘ్రికేఁ గేలుమోడ్తు 27

(అరలోఁగలకలము)

అ— (చెవియొగ్గి)

చ॥ పరిచితగానలైవ్రజభామలుగొందరుకండ్లుద్రిప్పఁగొం
దరుతలలూఁప గోవులస్తనంబులఁ బాల్పిదుకన్నివిష్టమా
కరయుగమట్లెయుంచియధికంబుగఁగొందరుమోదమంద శ్రీ
హరిమురళీరవంబువిననయ్యెను దుల్ల నశేషవిఘ్నముల్ 28
(ఆలోచించి- స్వ)

[illegible]

మురళీ గాయన మంతదాక వెపయుఃపూరంబనీగొప్ప యో

చెరుకానీకగతీపియంతవరకే సేవింతురో హో సుధా

నురలందాక వెనిక జకోరికికిక నీశోరేల నోవెన్నలా 29

(శీఘ్రముగా మురళి ముందుజూచి హర్షముతో)

తే॥ మురళీపాటకుజగమెల్ల మోహపడఁగ మిగులఁ ఱ్ఱనినల్లని మేనితోడఁ

గనులపండువుఁ జేయుచు -గడుసమీప మునకువచ్చెను నందునిముద్దుపట్టి 30

(తడవుయోజించి) అతిమానుషపౌరుషుండైనయీకృష్ణుఁడు లీలాబాలకవిగ్రహుఁ-డయ్యెను! బ్రహ్మానంద సమమగు నానందముతో నిండినచిత్తవృత్తిగలిగియొప్పుచున్నవాడు నేత్రములుమూసుకొని ధ్యానమునటింపఁజేయుచు

సీ॥ కడవలో దధిమాడ్కిఁ గలశవారాంనిధి చిచ్చిమథించితి వీవుదేవ

యావగింజవిధంబ నీవిమ్మెఁగొనకోర నిలయెల్లనహించి తీవుశౌరి

కీటకంబులలాగు మేటిరక్కసిగుంపు లావుమీరఁగఁజంపి తీవుచక్రి

పూపాన్పుపైఁబోలెఁ బాపరాయొడలిపై నెలమిమైనిదురించి తీవుశాఙ్గ-

వసుధ ద్విజాలంత్యజాలకట్టు వాఙ్మనముల కెంతొదూరంబునందుంటి వీవుశ్రీశ

బలిమి మాపూర్వపుణ్యంపుఁబంటకలిమి నిప్డు నరుఁడైతివిగ యిట్టియీవు కృష్ణ

నూ—ఆయుష్మంతుఁడా యిటుచూడు ప్రొద్దుపొడుపున లేచిపసులఁ గాయఁబోయినరామకృష్ణులరాక కెదురుచూచుచు వృద్ధులగునందయశోదలిరువురును గొడుకులకు గావలసినవస్తువులుపట్టుకొని వర్తించుచున్నవారు. కావున వీరితోఁగలసి యథేష్టముగా సరససల్లాపసుఖమనుభవింతము.

అ— నూతా యాలాగె రమ్ము గోపురసమీపమునకేపోవుదము (అని అందరునునిష్క్రమింతురు)

ఇది శ్రీజానపాటిపట్టాభిరామశాస్త్రిచే సాంధ్రీకృతంబగు
కంసవధనాటకమునఁ దృతీయాంకము

మండలాధీశ గండరగండబిరుద । రాయవేశ్యాభుజంగ వీరప్రతాప
యరిత్రిణాలవిత్ర శీలాంబికాగ్రపుత్ర । వితతకంచర్లగోత్ర పవిత్రసూత్ర॥ 155

తే॥ అంఘ్రితాడనచ్ఛేదితాయఃకవాట । ఖండితధనుఃకృపాణ ముద్గరకదంబ
సముదయోత్పాట నానాగసాతరేశ్వ । రాధిపతనిత్యశౌర్య హిమాగధైర్య॥ 156

తే॥ అనుగభూపాలరాజ్యపూజ్యప్రధాన । వీరవిద్యాంబికాహస్తవిపులశక్తి
గృహస్తముక్తాఫలప్రాయ గురువిధేయ । భళిరె పెద్దన్ననృప భళీభళి మహాత్మ 157

కం॥ అని భట్టురాఘవుఁడు తనుఁ గొనియాడఁగ నృపకుమారకులుపమలోనన్
జనితాద్భుతమందాక్షా । ననులై విని కథకు భయమున నెవ్వల వెలసె 158

ఉ॥ వాడిశరీరముల్పడఁ దనస్త్రము లెంతయుఁ బట్టాలి నేల జీ
రాడఁగఁ గుంతపట్టసశరాసనముల్ ధరనిచ్చుకొంచు నా
వాడఁగఁ ద్రోలుపాటుఁ జాలయున్ ధరణీపతిఁ జేరఁ జెప్పనో
రాడక సుస్సిరించు నయంబున నిట్లని పల్కిరార్తులై॥ 159

ఆ॥ భాస్కరాన్వయంబుఁ బాడు చేసె లవాంబ । నచ్చమైన వలమకిచ్చినావు
కన్నసంగరంబు వాటిల్లె ధర్మంబుఁ । దప్పనడచునతఁడు ధరణివిభుఁడె 160

కం॥ వంచన చేరాజకులా । ధ్యంచితుఁడనటంచు హంసయాన లవాంబన్
గించుఁడువరించె ధర్మము । ముంచెనసం జనులనోరు మూయం దరమే 161

కం॥ అని చెప్పిన ధరణీశుఁడు । విని కోపావ్యాప్తుఁడగుచు వీనినధింపుం
డనుమాన మేలననవుడు । జనవిభుతో నిట్టులనిరి జామాతలొగిన్ 162

ఆ॥ మేమె కాదు పెక్కుమేదినీశులుఁగూడి । వానిఁ జెనకరాదు వసుమతీశ
మశనతతులుఁగూడి మర్దింపఁజాలునే । మత్తగజము మారుమసఁగ గాని 163

వ॥ మరియు నతని ప్రభావంబు వినుము॥ 164

సీ॥ గజబృంద మైనను గదలింపఁగాలేని ఖురళీక వాటంబుఁ గూలఁదన్నె
నెట్టిమానవుఁడైన నెక్కు పెట్టఁగలేని బాణాసనంబులు భంగపరచె
గహనంబులోనున్న ఘనసత్త్వమృగములఁ బట్టి శిగల బలెఁ గట్టివేసె
నాఖేటవృత్తి చేనరిగి మేమడిగిన నచ్చొత్తి మృగములనిచ్చిపుచ్చెఁ
గోవ్యమ్మకులుగొనె సత్ప్రత్యయమ్ముగాఁగ । మనుజమాత్రుండె పెద్దన్న మాన
వేంద్ర)
యతనితోఁ బోరభీమున కైననశమె । వంచనను దెచ్చి మర్దింపవలెను గాని 165

వ॥ అనం గృష్ణగంధర్వుండిట్లనియె. 166

సీ॥ కంచర్లపురిచెంతఁగలదునీలతటాక మది తుంగభంగజాలాంతరంగ
మినమయూఖముల నీరివురఁ దత్కూర్ధ్వమస్థలమునఁ జణకసస్యముల బెంచి
కాపుండి గటవీమృగమ్ములురాకుండ నొడిశెలకాంగ్రుదుపొంగుండి రేలు
గాంధర్వవాహంబులు వేడ్కలశాద్వలభ్రాంతిచేడిగ్గి యాపంటచేను మేయ
బందఁబెట్టంగనూహించి పాలికాపు। జనులు వల్త్రాళ్ళు పగ్గంబులును శిక్షీన
ముఖ్యగజ్జాపగంపరల్ మోచికొనుచుఁ। బట్టనుంకింప జిక్కక పారిపోయె॥ 167

కం॥ నిచ్చలుబట్టంబోయిన। హెచ్చరికలనుప్పరంబు నెగసి యదేచ్ఛన్
విచ్చలవిడిపరువెత్తఁగఁ। జొచ్చిన నందొకటి నిండుచూలై యుండన్॥ 168

కం॥ దానింగని నేడు నీయా। జానేయంబినఁబోవుజాడలుతగునే
కానఁబడె నురకదింక ఖ। లీనంబిడి దీనిఁబట్టఁగ నేమేయనుచున్॥ 169

కం॥ జనములు పైపైచుట్టుం జననీకను వల్లెత్రాళ్ళు సవరింపుచు నే
ర్పునఁబట్టబోవ నుప్పర మున నెగసెన్ గర్భశాబమున్ ధాత్రిఁబడన్ 170

కం॥ ధరఃబడ్డహయకిశోరము। సరసన్ బట్టంగబోవుజనములఁ బశ్చా
చ్చరణంబులఁబడఁదన్నెన్। మరణంబై మూడు వేలమానుసులుబడన్॥ 171

ఆ॥ ముసుగుబైలుదేరి మూడు వేలనుజంపెఁ। బట్టఁబోవఁ గాళ్ళమట్టగించు
నింతకింత పెరుగ నెంతెంత జేయునో। కానమనుచు బోనులోనమర్చి॥ 172

కం॥ వెసనుక్కుమందసంబునఁ। బొసగించి నిరంతరంబు బూరియు జలమున్
విసువక పెట్టించితి నది। కసిమసఁగుచునుండు జనులఁగనుగొన్నంతన్॥ 173

మ॥ వెరపింకేటికిపొండు రేపు సకలోర్వీనాథులుంజూడ మీ
గరితల్మెచ్చుచురత్నకాంచనపరిష్కారంబులన్ మిమ్మునం
దరఁబూజించి వరప్రయాణముల సత్కారంబుఁగావింపుచో
మరిచిన్నల్లునకిత్తుగుర్రమని సన్మానించి కాహ్వల్లనిన్॥ 174

కం॥ అరణంబిచ్చినయంతనె। మరణంబొందించునది సమస్తమహీశుల్
బురవీధిఁజూడ లవ దనసరులతోఁజిచ్చురికి పరమవైభవమందున్॥ 175

తే॥ కించునిటుద్రుంచి కులమురక్షించుకొనుట। మేలుగాదెయటంచు నమ్మేదినీశుఁ
డాడుమాటలకానందితాత్ములగుచు, మదిభ్రమించిరి నృపతిజామాతలెల్ల॥ 176

వ॥ ఇట్టు దంభప్రయాణులై యభ్యాంజనావసరంబున. 177

సీ॥ తలలంటవచ్చినతరుణులు భూపాలసుతులకైశ్యంబులుజూచినగుచు
నగరేశులార మీతలవెంట్రుక లదేల ఖండింపఁబడియెనిష్కారణముగ
నటక క్రీడఁగరాక నంకంబులై యున్న వదియేమి తొడలపైనచ్చులట్లు
రాకాసుధాంశునిరాకరించెడిమోము లందముల్లక్కినచందమేమి
తెలుపుఁడన్న వారు తెరవలకిట్లని రతివలార దేశమతము లింక
వేటఁబోవుకతన వెలవెల్లనై కాంతి కళదొలంగె మాముఖంబులెల్ల॥ 178

క॥ ఉత్తరదేశజనాళికి। నిత్తెరగొప్ప దిది మహీపతిమతమాఁ
జిత్తములనొండుదలపుచు। నుత్తలపాటొందకుండు డుత్పలనయనల్॥ 179

క॥ కావుననీపెద్దన్నకు। లేవాచిహ్నములు పాటలీగంధులు మీ
భావంబులనుంచుండిది। దేవరహస్యంబు దీనిఁదెల్పకుడెందున్॥ 180

ఆ॥ అనుచుఁగప్పఁపుచ్చి యభ్యంజనస్నాన। ములుముగించి మాల్యములుధరించి
భోజనోత్తరమున భూసురావళితోడ । ఘోటరత్నమున్నచోటికరిగి॥ 181

మ॥ గంధర్వాహ్వయుఁడైనరాజు యమునాగంగాంబువుల్ దెచ్చిత
ద్గాంధర్వంబుఖురాగ్రముల్గడిగి వేడ్కన్ జంద్రసారంబు శ్రీ
గంధం బక్షతలున్ ధరించి సుమనఃకాండంబులంబూన్చి స
ద్గంధాశ్లేషితధూపమిచ్చుతరి శుద్ధాంతాంగనల్ ప్రీతితోన్॥ 182

తే॥ గంధసారమృగీమదాగరుకచూర । సారఘనసారకాశ్మీరసహితమై మె
ఱుంగు ముత్తెపుమ్రుగ్గుజెలంగు పసిడి। పళ్ళెరంబున రత్నదీపంబులునిచి॥ 183

తే॥ రమణులెల్లరుమంగళారతులుపాడ । నంతిపురమునఁబుట్టుకార్యంబెఱింగి
ధర్మగుణసీమ పతిదేవతాలలామ । పడఁతుకలవాంబ యిట్లని పాడఁదొడఁగె॥ 184

సీ॥ కలికిరూపమునాడు కలిమలాత్ములఁద్రుంచుమాధవకంఖాణ మంగళంబు
ఛాయాసతినిడించి సంజ్ఞారతులజొక్కుమార్తాండుహయరాజ మంగళంబు
క్షీరాంబునిధిలోనసరితోడఁబుట్టువై మహిమనొప్పుతురంగ మంగళంబు
మునుపార్థునిరతంబుమోచిగెల్పించిన మహనీయగంధర్వ మంగళంబు
నీరధిక్రుపీటములు బొజ్జనిడఁగ్రోలి। మందుబడబాభిధానాశ్వ మంగళంబు
జోకఁగంచర్వక్త్రసతటాకమునను। మహిజనించినకారొప్పల్ల మంగళంబు॥ 185

కం॥ అనిమంగళారతులు సు । స్వనయుక్తముగాఁ గఁ బాడి సాధ్వీమణి నే
ర్పునఁ దనప్రాణేశుఁడు సుఖ మొనయఁగ నను గూడి బ్రతుకనిమ్మని మ్రొక్కెన్॥

కం॥ ధర జాగి మ్రొక్కి పయ్యెట । చెరఁగొగ్గిన రాజవదనఁ జేసి కృపావి
స్ఫారంబు మెరయ దక్షిణ । కర మంకురమునను బెట్టి గాఢప్రీతిన్॥ 187

వ॥ అంతమహీకాంతుండుపస్తరంగరత్నంబునుంబూజించి శిలీముఖధూరికాగర్భంబగుగంధాస్తరణాచ్ఛాదితంబుగుస్తంబుగాఁగావించి కనిష్ఠజామాతంబిలిచి నవీనాంబరాభరణంబులొసంగి యిట్లనియె.

కం॥ భవదీయదేశమున బహు । జవనతురంగముల నెక్కి చరియించెడివా
రవలీలవాహకత్వము । సవరింపుము దీని నెక్కి చాతుర్యనిధీ॥ 189

ఆ॥ ఈతురంగరత్న మెట్టిమానవుఁడైన । నెక్కి యొంటిగాను మోవఁ బోడు
గాన నీవు దీని నెక్కొమ్ము పెద్దన్న । చిన్నగురిమనుచుఁ జిన్నబోకు॥ 190

మ॥ అనినం బలికిన నన్నదేల మనల గన్న బడ్డమె యొక్కఁ ద
గ్గన నమ్మె నెక్కి నశాగ్రహారము నేయుం బోవు నాలోకనఁ బో
వన వేగంబున శ్రుమిస్పృష్టముల తోవం బోయి తల్లిన్ మురం
బెనయం గాంచి ముఖంబు మూర్కొని రహిన్ హోమాన్వయము సేయుం ముక్॥ 191

ఆ॥ తల్లి చన్నుఁ బాలు ద్రాగుచుండఁగ శచీ । వల్లభుండు వానివలను జూచి
సురసభను నన్నుఁ జూచితేఁ బెద్దన్న । సురసముం దవగు విశుద్ధచరిత॥ 192

ఉ॥ చారుపతివ్రతాచరణశాలిని యాలవ ధర్మచిత్త ని
ష్కారణ మాత్మబంధుపరిజనులిన్నిఁ జోరంగఁ బంచి ర
ద్వారుణకర్మకర్మకృతశ్రుష్ణుల జంపి పురంబులోన గు
త్సారదవిగ్రహోమములు దున్నకపండఁగఁ జేయు మున్నతిన్॥ 193

కం॥ అనియింద్రుఁడానతిచ్చిన । విని గ్రద్దనహయము నెక్కి వెడలునవసరం
బునఁ గంచెర్లపురంబున । జనములు పెద్దన్న జచ్చెఁ జచ్చె నటంచున్॥ 194

కం॥ కలఁగఁబడి ధరణి వెడకి । ఖలజనులంతంత నెచటఁ గానకగుములై
పలుతెరఁగుల నలజడి వడి । జలనిధిఁ బడి సమసె ననుచుఁ జాటిరి పురిలోన్ 195

సీ॥ కొందఱు స్థానంబుఁ గుసుమగ్రమటంచుఁ గొందరు పాడుకల్గూలెననుచు
నడవమిన్నపుటఁ బడ్డసనుచుఁ గొందరు చేల ధరజారెననుచుఁ గొందరు నిజాయు

ధమునీయెడలఁజూడఁదగె నాగవల్లికాఘనపంక్తు లిలఁబడ్డజాడఁగలిగెఁ
దవ్వులమ్మిటఁగ్రక్క ధాతురాగంబుగాఁ దరుచైన పాషాణతలములందు
ననుచుఁగొందరు నలువంకలరసియరసి । కాయమెచ్చోటఁబడ్డదికానరాదు
శాకినీగ్రహరక్షఃపిశాచసమితి । భుక్తిగొని తృప్తిదేలెఁగాబోలునటని॥ 196

క॥ అనినిశ్చయించి జననీ । జనకులు తోబుట్టువులును జలజాస్యలవే
గనుగొని పెనువగఁబలికిరి । మునుకొని కనుగొనల బాష్పములఁగురియంగన్ 197

క॥ జననీ మగనింబాసిన । వనితామణిలేదు మాదువంశంబునఁ దం
పున నగ్నిఁజొచ్చి పుణ్యయుఁ । గను నీపతిఁగూడి సార్వకాలము దివిలోన్॥ 198

వ॥ ఇట్లు కృష్ణగంధర్వుండు కూతుంబోధించి

క॥ పటువహ్నికుండమొక్కటి । ఘటియించి కుమారిఁదెచ్చి కాన్పింపఁగ ను
త్కటగతిఁగుంభాసారం । బటఁగురిసెఁ బురందరాజ్ఞ నభ్రచయంబుల్॥ 200

క॥ పతి గతజీవుండైనను । సతియొక్కదినంబుఁబ్రదుకఁజన దట్లైనన్
గతిచెడిచండాలాధమ । పతియనిపల్కుదురు వాసవప్రముఖసురల్॥ 201

క॥ కావుననొండొకకుండముఁ । గావింపఁగవలయు వీరకర్మంబని త
ద్భావవల్లభుఁడతిసత్వర । భావంబునజనులఁబంచెఁ బరిసరభూమిన్॥ 200

వ॥ వారలుంజని బహుళప్రయత్నంబున. 232

సీ॥ కాలాగరులు గంధసారకాష్ఠంబులు సల్లకీసురదారుతల్లజములు
ఘనసారమును గౌశుకంబు కాశ్మీరంబు లామజ్జకంబు శిలారసంబు
ఘృతముఖ్యసౌరభాగ్నేయవస్తుప్రతానంబుల సంవిధానంబుఁజేసి
తన్మధ్యమున వహ్నిదరికొల్ప గంధపుష్పాక్షతాదికముల నర్చలిచ్చి
భూసురులకును బుణ్యసువాసినులకు నవ్యపట్టాంబరములు ధనంబులొసఁగి
కృష్ణగంధర్వనృపతి రోచిష్ణువైన పుత్రిక లవాంబికను దానిపొంతనుంచ॥ 204

వ॥ తత్కాలంబున.

క॥ సవినయగుణవతి ముక్తా । లవ దనప్రాణేశు నాత్మలక్ష్యస్థితుఁ గా
సవరించి ముఖ్యదేవ । స్తవనంబొనరించె నిట్లు సరసధ్వనులన్॥ 206

తే॥ పాలమాచాపురపుచెన్న భవవిభిన్న । చేరినామదినున్నమాచెర్లచెన్న
నరులునినుగన్న భవబంధనములుసున్న । పాలతియెదనున్న కారెమపూడిచెన్న

చ॥ పతినెడబాయకుండ భవబంధచయంబులు బొందకుండ దు
ర్మతులనుజూడకుండ ననురక్తిమిముంగొనియాడుచుండ స
ద్వ్రతములు సేయుచుండ సురవల్లభముఖ్యసమస్తదేవవ
ర్ణితచరణారవింద కరుణింపవె నాకొకజన్మముండినన్। 208

తే॥ అనుచుఁ గేల్దోయిముకుళించి యాలవాంబ। చుట్టువలగొని నరపతికట్టెమొక్కి
దిగ్గనురికెను విస్మయోద్వృత్తి నుష్ణ। కరుని జేరెడిచంద్రరేఖయును బోలె। 209

కం॥ జ్వలనుఁడుభయమున నాసతి। తలఁగట్టినపూలదండ దారంబైనన్
మలయుచుఁ గాల్పక హిమశీ। తలుఁడైయుండెంగభర్తదాక్షిణ్యమునన్॥ 210

కం॥ చంచద్గతితురగముపై। మించి నభోమార్గమున నమేయనవోష్ణీ
షాంచలమించుకిడించిన గాంచిలవాంబికయుఁ బట్టెఁ గరయుగళమునన్॥ 211

ఉ॥ పట్టినఁ బైకిఁ జేదుకొని బాలిక నశ్వముమీదనుండటన్
బెట్టుక బెట్టుగానచటఁ బెద్దన గ్రద్దనఁ గోపమూర్తియై
కట్టలుకం గుణధ్వని జగంబులు నింపఁ దురంగమిట్లనున్
ముట్టుచుమూకలన్ మొదలుముట్టఁగమెట్టెదఁగొట్టి గట్టెలన్॥ 212

తే॥ నీవు నీసాధ్వి భయపడనీక బాహు। యుగళమునఁబట్టి నాదుపైనున్నఁ జాలు
మజ్జననిదుగ్ధములఁ ద్రావమాన్చినన్ను బందివెట్టినకంచర్లభంగపరతు॥ 213

వ॥ అనినిశ్చయించి.

కం॥ ధారాపంచకకృతసం। చారంబుల రాజహర్మ్యజాలంబుల్ ప్రా
కారంబు లాపణములున్। ద్వారంబులగూల్చిజనుల సమయన్ జేసెన్॥ 215

కం॥ ఒక్కటజనములశిరములు। వ్రక్కలుగావించ నంబరచరత్వమునన్
రెక్కలుగలిగినగుఱ్ఱపు। రక్కసుడనుసంశయంబు రాజుకుఁదోచెన్ 216

తే॥ తోఁచి చతురంగబలములతోడనప్పు డనుజజామాతృపుత్రసహాయుఁడగుచుఁ
దరమికోదండమునగుణధ్వనులుజేసి పటుశిలీముఖపంక్తు లప్పాటఁగురిసె॥ 217

కం॥ ఆసైన్యపతులుబరపిన। భాసురశస్త్రాస్త్రపంక్తిపైకొన ఘృతముం
బోసినమండుకృశానుని। వాసిని నవ్వారువము జవంబున మెరసెన్॥ 218

సీ॥ వాలసంచాలనోద్వేలవాతూలాభిహతిఁ బెక్కుసైన్యసంతతులుగూలె
చరణాగ్రఖురటంకసంఘట్టనంబునఁ బ్రాకారతోరణప్రతతిదుల్లె

తతబాహుదండ విశ్రుతతాడనంబుల హస్త్యశ్వయూథంబు లానంతలయ్యెఁ
గఠినహేషానాదకల్పనంబులఁ జమూపతులు గుండెలు వ్రీలిపడిరి ధరణిఁ
జిత్రచంక్రమ ధారావిశేషములను । గోపురాట్టాలకానేకకుడ్యసమితి
నుగ్గునూచంబుగా ధాత్రి ద్రుగె నొక్క । జాములోపల మింటనిగ్గరుబుబోగడ 219

కం॥ ఖురలాంగలముల భూమీ । శ్వరఘోటము బెడలదున్ని శ్రమజలవృష్టిన్
గురిపించి ధరణిఁ గీర్తి । స్ఫురదంకురముల నవ్వసుంధరనాటెన్॥ 220

తే॥ అంతఁ బెద్దన్న ముక్త్యాలవాంబికను య । థోచితాలాపశతములనూరడించి
షడ్గకుల భావుకుల నెల్ల సంస్కరించి । శ్వశురునకు నగ్నిసంస్కారసమితిఁ జేసి॥ 221

కం॥ వారిసరోరుహనయనలు । వారింగూడంగఁ జనఁగ వహ్నింబడి యా
వారిజనాభునిలోకము । వారితగతిఁ జనిరి జగతివారునుతింపన్॥ 222

తే॥ బలిమిఁ బెద్దన్న గంచర్లఁ బాడు జేసి । ధారుణీశున కగ్నిసంస్కారవిధులు
గూర్చి ముక్త్యాలవాంబికఁ గూడి తనదు । పురముఁ జేరంగఁ బోవునప్పుడు పథమున॥ 223

వ॥ ఇట్లు కతిపయప్రయాణంబులం జనిచని. 224

కం॥ శంకరభక్తసమూహాన శంకరమై విమతభూపజయలక్ష్మీము
ద్రాంకణమై ధరణీసతి కంకణమనఁ బరఁగు పానుగల్లనుపురమున్ 225

వ॥ తత్ప్రాంతంబున.

కం॥ లవలీవల్లీ నవప ల్లవకోమలగాత్రి చారులక్షణగుణ యీ
లవ డస్సె నింకఁ జన నేల పసింపంపగు నోడ శల్లంపఁగ నేలా 226

వ॥ అనితలంచి. 228

ఆ॥ పానుగంటినికటభాగంబునను శనై శ్చరుని చట్టనంగఁ బరఁగు దర్ప
ణోదరంబుపగిదినున్న శిలాతలో పాంతమునను దనదు పడతిడించి 229

కం॥ తురగోత్తమంబు నచ్చటి తరుమూలంబునను గట్టి తరళాక్షికి నా
స్తరణంబుగాగ నాత్మో త్తరపరిధానంబుఁ బరచి దయదులు కాడన్ 230

కం॥ తరుశీలలావు దానుం బరమానందమునఁ బాదపచ్ఛాయవసిం
చిరి హయరాజము దక్షిణచరణంబునఁ దన్నె నేల సహజత్వమునన్ 231

కం॥ చరణాహతిఁ గలఁగి వృషదం తరమున నొకకోడి వారిపధ్వనితో వ
చ్చిరమద్రుమఁ దన్నె నెవ్వం డరికాననవీతిహోత్రుఁడని యెరుఁగఁడొకో 232

కం॥ అనిపలుకు తామ్రచూడ ధ్వనివిని హయరాజమనియె ధరఁగంపెల్లన్
జనపదముఁ గాల్చి మట్టిన ననుఁ గాల్పొల్లఁడని మనమునన్ నమ్మి మొగిన్ 233

కం॥ కాలారికరుణఁ గలిగితి లీలాహరి నెదురనాకు లేరెవ్వారల్
కాలం బింద్రునితోనగుఁ గాలజ్ఞుఁడవీవు నేఁ ద్రికాలజ్ఞుండన్ 234

కం॥ తెలిపితి నాపూర్వోత్తర మిల నీజన్మప్రకారమింతయు నాకున్
దెలియం జెప్పుము వినఁగా నలయుం గాలజ్ఞమూర్తి వర్ధితకీర్తీ 235

వ॥ అనియడిగిన హయంబునకుఁ జరణాయుధవరుం డిట్లనియె. 236

కం॥ ఫలదుండన నొకముని స త్ఫలవృక్షము లాశ్రమమునఁ బాదులలోనన్
మొలిపించి పెంచి పండిన ఫలములు నాహారముగఁ దపంబొగిఁ జేసెన్ 237

కం॥ అత్యంతనియతి నమ్ముని నిత్యస్నానమున కంబునిధిఁ జేరఁగఁ ద
త్ప్రత్యయముఁ జూచి తస్కర కృత్యంబున లుబ్ధకులు గ్రహించిరి ఫలముల్ 238

కం॥ విచ్చలవిడి ఫలములుగొని చెచ్చెర భక్షణమొనర్పఁ జిరకాలము పా
టచ్చరుల వెదకి కానక వచ్చి మునీంద్రుండు మంత్రవైభవశక్తిన్ 239

కం॥ కస్మిలమిదేల ఫలముల పస్మారులకందకుండ బంధించి జగ
ద్విస్మయముఁ జేతునని వెస భస్మముఁ గావించెఁ దనదు ఫలవృక్షములన్ 240

ఉ॥ అంచితమంత్రశక్తి జనితాగ్ని దహించినబూది కుండికన్
నించి మునీంద్రుఁ డంబునిధినీట నిజోచితకృత్య మిచ్చఁగా
వించి నిజాశ్రమంబుకడ వ్రేల్మిడిఁ జల్లినఁ దొంటిపోల్కి జ
న్మించి ఫలించె వృక్షములు మెచ్చి భుజించు ఫలంబులెప్పుడున్ 241

కం॥ అకార్యముఁ గని చోరకు లక్కజమున నీఫలంబు లాహారింపన్
మక్కువపడి పెనుజుక్కై కుక్కుటమై కొక్కరోకొకోయని కూయన్ 242

కం॥ ఆకోడికూత విని ముని వేకువజామయ్యె నిత్యవిధి దూరంబై
లోకంబున కెగ్గవు సంధ్యాకాలము దప్పె నేనినని వెస వెడలెన్ 243

చ॥ వెడలి సరిత్పతిం గని పవిత్రజలంబులఁ గ్రుంకఁబూను న

క॥ విజితాభ్రము లల కౌనులు విజితాభ్రము ల్లలి కురులు వివరింపంగా
విజితాభ్రము లల నాభులు విజితాభ్రము లబ్జ నడలు విమలాంగులకున్॥ 58

సీ॥ అలకీల్జడ లెపోలుటకిదియె యూరువు రమణీయనాగోత్కరములఁ బోలు
నల యూరు లేపోలుటకిదియె తన్నఖపాళియు శుభకరభములఁ బోలు
నల ఖంబు లేపోలుటకిదియె కంఠసీమలు చూడఁ దారకంబులను బోలు
నల కంఠము లెపోలుటకిదియె తనువల్లికలును గల్యాణపూగములఁ బోలు
నట్టి తనువు లెపోలు లేమరిది తలప గలికిచూపులు చంచలాళులను బోలు
నట్టి చూపు లెపోలు లేమరిది మోము లతనుశరజాతములఁ బోలు నద్భుతముగ 59

సీ॥ శ్రుత్యంతపరిచితిశోభిల్లు నేత్రంబు లాగమాభ్యాసతనమరెఁ గుచము
లనఘపురాణవాసనఁ జెందె మధ్యముల్ ఘనకల్పరీతులఁ గాంచెఁ గురులు
ధర్మశాస్త్రస్థితిఁ దనరె భ్రూదృష్టులు జ్యౌతిషస్ఫూర్తితో నమరె నఖము
లమరఁ బాటల నగ్నమంకించె మోవులు కవితాపరిస్ఫూర్తిఁ గని యొనడక
లలమహాహీనశయ్యాంకుడైన యట్టి హరి సదాగూఢపదభూషుఁడైన హరుఁడు
సూనపాకతఁ జెలఁగు వాగ్జాని యట్టి కమలనయనల వర్ణించఁగలరె తలప 60

వ॥ అట్టిమహిషీవర్గంబు పరశ్శతపరిచారిణీపరివృతంబై పురోభాగంబున నిల్చిన

చ॥ బొమలెగవైచి కన్గవలఁ బొందుగఁ గన్గొని పేర్కుగ్రుచ్చి కొం
చెముగ హసించి యొక్కొకసక్కెమటాడి యయారె నీకు గం
దము కడునందవాననిముదంబునఁ జెక్కిలిఁ గీటి యిట్లు నె
య్యము మెసఁగఁ బల్కరించె హరి హరిణాక్షులనందర నన్నిభంగులన్ 62

వ॥ అంతటఁ దత్సతీసహితుండై గృహారామాభిరామమార్గంబునం జనిచని 63

మ॥ సరసీజాక్షుఁడు గాంచెనంత నిఖిలాశాసక్తధూతప్రసూ
నరజశ్చిత్రితశాటికన్ నవఫలాంధశ్శ్రేణితోద్బుద్ధ హే
పరమానందనఘోటికన్ దరుశిఖాస్థాయద్ధ్వనేందిందిరో
త్కరదంభాంబుదదర్శనప్రమదనృత్యత్కేకినీనాటికన్
సరసాపాదితమారధాటికను దచ్చంచద్వనీవాటికన్ 64

లయగ్రాహి

మాలములరంగువిటపాళుల బెడంగును బ్రవాళములయొప్పు ఛదజాలములతీరున్

గ్రాలుపసక్రొమ్మెగడడాలు పువుగుత్తులపిసాళిబిగి దుప్పలుగరాలినరజం బా
వాలములునిండిబయలొలిఁజను తేనియల కాలువలఁదెప్పలుగఁదేలెడుఫలంబుల్
చాలనటుకాంచి యలబాలికలఁగూడి వనమాలియు నయారెయని సోలితలయూచెన్

వ॥ మరియు నిష్కుటంబయ్యును సకుటంబై శుకపికనికరంబుల కవనంబయిన వనంబునందు నసూనంబులయిన సూనంబులనుద్భవించి యనాశాస్యంబయ్యు నాశాస్యంబయిన మధురసంబుఁగ్రోలి పరవశతావిర్భావంబులయ్యు నపరవశతావిర్భావంబులై మెదలకయున్న తుమ్మెదకదుపుల పజ్జకుంజని యపఘనాభిఖ్యంబులయ్యు ఘనాభిఖ్యంబులయిన శౌరియంగంబుల యొప్పిదము రెప్పలిడక తప్పకచూచు వనలక్ష్మిచూపుల రూపులనొప్పె భళిరెయని సావధానంబుగాఁగనుచును గనకరంభాస్తంభంబులకు నేగి యంతంబులయ్యు ననంతంబులై నపత్రంబుల విలాసార్థంబుగాదారుచును దారకకాంతిగల్గి ఖరంబులయ్యు నఖరశబ్దాభిధేయంబులై నఖంబుల గండమండలస్వేదబిందుబృందంబులఁజిమ్మివేసరిగంధవహకందళంబులఁగోరుచును గోరకగణంబులు ప్రతిచ్ఛదమూలంబునుబిక్కటిలినమల్లికావల్లికామతల్లికలఁగాంచి వలక్షంబులయ్యు నవలక్షంబులయ్యె నౌరయక్కజపుఁజక్కఁదనమనుచును నవకవసతినున్నకతనవసుధైకమధురంబులయ్యు నవసుధైకమధురంబులైన కీరకలాపంబులయాలాపంబులుగానరయుచును నరయుకగతి నవలంబించిసంచరించె నచ్ఛంచలనయనాసంఘంబు మరియును. 66

## రగడ

లలివిరులకుబోరెడుతరిఁ గుచలోలతలాజిక్కుచు లతలంజిక్కుచు
వలిగొనుపూదేనియజీరుకున జవమ్ములుదక్కుచు వమ్ములుదక్కుచుఁ
దగునొసలంగలచిరుచెమట నిరంతరముగనూర్చుచుఁ దరముగనూర్చుచుఁ
దగిలెడుతేటికిజంకుచెలిని వింతగనూరార్చుచుఁదగనూరార్చుచు
డాగుడుమూతలనుల్లసములు జగడంబుగనాడుచు డంబుగనాడుచుఁ
గాగుచుఁదమిఁగొనువికసితకుసుమ నికాయమువాడుచుఁ గాయమువాడుచు
రమణవసంతములాడినకుసుమ పరాగముఁబెంపుచు రాగముఁబెంపుచుఁ
దమతమయలరులువొత్తైనసిన సుందరులకుఁబంపుచుఁ దరులకుఁబంపుచు
నలులందెలబెదరిన ముఖరాజీవాదులవాగుచు వాదులవాగుచుఁ
దులకించిననెమ్మలతో లలితగతులకుందూగుచుఁదులకుందూగుచు
రమణీయతఁగేదగిరేకుల నఖరమణులఁజీరుచు రమణులఁజీరుచుఁ
దమిముఖవాసనలం దుమ్మెదబిత్తరులందూరుచుఁ దరులందూరుచు

జడఁజూపియుఁదాపాగ్నిని మధుపవిసరములవేల్చుచు సరములవేల్చుచుఁ
గడుదళసరికర్పూరము హస్తయుగళములఁదాల్చుచు గళములఁదాల్చుచు
సిరులునహించిరిసతులు ఫలభ్రాజితసురసాలన్ జితసురసాలన్
సరసద్యుతిశతశతహసిత దురాసదనవలీలన్ సదనవలీలన్ 67

ఉ॥ నారియొకర్తు చొక్కపు ననల్గల చక్కని చిన్నిపొన్నకున్
జేరి ప్రసూనగుచ్ఛము లశేషముఁగోసియు గ్రేశినోర్తు నీ
భూరుహమెక్కుమన్న నగి పూయఁగఁజేయుదు నాకదెంత య
మ్మేరువుగాదు కాదిది నమేరువనందగిపూచెఁగ్రమ్మరన్ 68

తే॥ వారిజాక్షులు సరసభావంబులయిన యరుణతరుణాత్మ పంచశాఖాంచలముల
నంటఁ బ్రాయఃపరిస్ఫూర్తినమరు చూత వాటి సుమభూరిమహితమైవరలకున్నె

చ॥ ధరణితలంబునందుఁ గలదా సవతొక్కటినాదునాస కీ
వరయుమటన్నఁ గేరి యొకయంగనయెత్తెమొగంబు సాటి యి
త్తరి మరియొక్కటీశతశతంబులఁ జూపెదన న్నయట్లుగా
నరిదిఘటిల్లఁగోరకితమయ్యెదళంబుగఁ జంపకౌఘమున్ 70

ఆ॥ కొమ్మలురికితన్నఁ గొంచకపైఁబడ సుమియ వకుళవంజుళములకప్పు
డలమబాగెతోఁచె నహహ లోకోత్తర తరులకిదియ నీతిసరణిగాదె 71

ఉ॥ దీనిప్రసూన మమ్మరునితీవ్రఁపుటమ్మయి పాంథగేహినీ
మానమడంచు నన్న గతిమానినియొక్కతెతన్నె నంతటన్
గానగనొప్పె నేతదురుఘాత ముఖస్రవదశ్రుధారలై
సూనగుళుచ్ఛసంఘము లశోకమహీరుహమాళిపాళికిన్ 72

తే॥ ధవళనయనలపాదఘాతములయందు వదలదుత్కంఠికాశ్రిలవంజుళంబు
దానికినశోకమనుబిరుదంపుపేరు మిగులఁజెల్లదెయకట ముజ్జగములందు 73

చ॥ వడినిడెఁజాటు మోమునకు వాతసముద్ధతమైన కెంపు పు
ప్పొడి తెరలెండలంచు జలపోతసురంటియొకర్తు మించుసొం
పడరఁగనట్టినీరజచయంబులుగోయకుమంచు నెంతయున్
జిడిముడిపాటుతో మనవిఁజెప్పఁగవచ్చిననూర్యుఁడోయనన్ 74

చ॥ ఉడుగకయిద్దరొక్కననకోరడిఁబోరఁగనోర్తువారితో
వెడదరదంబులుండియును వెన్నెలదప్ప మెసంగఁజేమియున్

గడునొకయంత్రదారియని గాటఁపునీకథవిప్పుదానికి
బడుననవిప్పె నత్తరిని బన్నడనొర్తు లభించెనూనముల్ 75

వ॥ అంత

సీ॥ పూఁదేనెఁజిలికి కెంబుప్పాడి మేడించి చుక్కబొట్టుగదిద్దెనొక్కచెలికి
గన్నెరేడగిరేకుసన్నగిలగఁజీరి యొగి దీగఁగాఁ బెట్టెనొక్కచెలికి
గొనబైనకనకంపుటనటిలేఁజిగురుటాకొరపుపయ్యెదఁజేసెనొక్కచెలికి
స్థలపద్మముకుళంబు సరసంపుకుప్పెగాఁ జొక్కంపునెరిఁగ్రుచ్చెనొక్కచెలికి
బొన్నపూమొగ్గముత్తియంపుమిటారి ముక్కరగఁదీర్చి నేర్పునొక్కచెలికిఁ
నపుడు కేళీవిలోలాంతరంగుఁడైన వారిజాక్షుండు శృంగారవనమునందు॥ 77

వ॥ అంత.

సీ॥ మునుకొని సర్వతోముఖభంగమయ్యును ఘనతరామోదంబుగలుగుదాని
నరసిచూడ జడాశయంబయ్యు సంతతహంససేవనమునమరుదాని
శ్రీమదాపూరితజీవనంబయ్యును నీరజస్థితిని రాణించుదాని
నతులనదీనభావాశ్రయంబయ్యును శక్రేశ్వరస్ఫూర్తిజరుగుదాని
నొక్కకమలాకరముఁగాంచి యువిదలెల్ల నక్కజమటంచు నామురహరునిగూడి
యుచితవేషంబులుఁధరించి యోలలాడ దొడగిరతిసంభ్రమమునఁదత్తోయములను 79

మ॥ సరసీజాళిగతాళిసంఘము నిజేచ్ఛన్వారి నెమ్మోము తా
మరలంజేరి సుగంధలోభమెదద్రగమ్మన్ ఝుంకరించెన్ మనో
హరనాదంబున నంతఁదన్ముఖవిరోధాందోళితాంభోరుహో
త్కరదౌత్యంబు భజించి సామములు వక్కాణించు చందంబునన్ 80

సీ॥ నీటిలోపలఁ దననీడఁ జూచి దెనీరుపాపయొయని యుల్కిపడియెనొకతె
యదెయిదె కొట్టుదమంచుఁ జెంగటనున్న పద్మనాళముఁ గేలఁబట్టెనొకతె
జంతకుమని హస్తకంకణంబులు బిట్టుమొరయ నచ్చెలివీపుఁజరచెనొకతె
పాలుపొంద వెలిదమ్మిపుప్పొడిమంత్రించి వెరవిభూతిగఁ బెట్టె వెలదియొకతె
వాసిఁ దెలిరేకుమూకుటఁ గేసరాన్న పుంజమపుడు బడిమిఁద్రిప్పిపోసెనొకతె
ప్రేమనీకాళియద్వేషిపేరునుడువ మెలగునేయిట్టిభయమంచుఁ బలికెనొకతె 81

ఉ॥ చిమ్మనగ్రోవిఁబూని సరసీరుహనేత్రుఁడు నీరుఁజిమ్మగాఁ

గొప్యమొకర్తు వస్త్రమునకుంబడకుండఁగఁబట్టెఁబాణి భా
గమ్ములు దన్నఖంబులునుగన్పడెఁజుక్కలు చెందొవల్ తదా
స్యమ్మనుచంద్రబింబమున కర్డమువచ్చినభంగి నెంతయున్ 82

శా॥ లీలంజివ్వనగ్రోవిఁదాల్చిచెలి యాలీఢస్థితిన్ నిల్చియు
క్కీలాలంబెగఁజిమ్మఁ బొంకమయివీక్షింపందగెం బత్నియో
జాలం బచ్చెలిహస్తపల్లవము లజ్జాతంబులంగెల్చి యో
షాలోకంబునుతింపనిల్పిన జయస్తంభంబుచందంబునన్ 83

తే॥ ఒకతె మొగమునజలగూడియువిడమీఁద ; నీరుఁజల్లంగనపుడురాశించె వాఁ
కరములే తెంచునాసుధాకరునకర్ఘ్య పాద్యములొసంగుచెంగల్వబారుఁ బనఁగ 84

తే॥ ఇట్లునీరాడిహరియుఁ బూర్ణేందుముఖులు నార్ద్రవస్త్రంబులూడ్చిదివ్యాంబరములు
దాల్చి తొడవులుబెట్టి చందనమలంది కురులుతడియారవిడచి క్రొవ్విరులుముడిచి

చ॥ ఒనరఁగనంతఁగన్నెలవు డొండొరుచొక్కపుఁజెక్కుటద్దముల్
గనుగొని కుంకుమంబుఁదిలకంబుగదిద్దిరి కేరిపుష్పాదుల్
ననలఁబొసంగుకప్రపుటనంటిరవల్గొనిపూవుఁదేనెనీ
రునఁబదనిచ్చి సన్నముగఁ గ్రొన్నెలనామముఁదీర్చిమున్నుగాన్ 86

వ॥ అప్పుడు.

కం॥ మగుడగనింటికినేగుట తగునో యీపూవుమానుదండలనీఁక లె
స్సగవిశ్రమింపుటదిబా గగునోయని సంశయింపు నాసమయమునన్ 87

సీ॥ పొదలుపూదోటలో వెదకి యెచ్చట నెండపొడలేని యొకగుజ్జుపొన్నక్రిందఁ
గపురంపుటనటిలేకంబంబులుగఁజేసి నెరవాదిపూవుఁ బందిరిఘటించి
గొజ్జంగినీరునగ్రుచ్చెత్తి కపురానరంగుమీరంగ నరుఁగుపైచి
కనకంపుచకచకల్ గలిగిరంజిలు కన్నెగేదగిపూజాపఁగీలుకొలిపి
మెండుగల్గినమల్లెపూదండదిండు దండనొరుగంగనిల్పి యందంపుఁజిగురు
తోరణముఁగట్టి చావడితీరుదిద్ది యొలమిననపాలుఁ డచ్చటికేగుదెంచె 88

తే॥ వచ్చి యారుక్మిణీసతీవల్లభునకు నతనిదేవేరులకునునవంతముదిత
చిత్తుఁడై పలుమరుచేతులెత్తిమ్రొక్కి మన్ననలుబొంది యిట్లనివిన్నవించె 89

కం॥ అయ్యా కలదొకవిన్నప మియ్యుపవనసీమనిప్పు డేనేర్పుగతిన్
నెయ్యమినొకపూజప్పర మొయ్యనరచియించితిని సముజ్జ్వలభంగిన్ 90

కం॥ ఇందుంగల్గినపూపొద లం దిరిగినయళులు యొకయెడఁ గొలంకులచలినీ
టం దేలినయలతయుఁ బో వం దాల్మిని విశ్రమింపవలెనింకనిచటన్ 91

వ॥ అనియిట్లువిన్నవించిన నతనివినయసహితాభిహితంబులకభినందించి యంగీకారవ్యంజక లతాంగీముఖచేష్టాదర్శనపూర్వకంబుగా నంగీకరించితదాదిష్టమార్గుండై చని యొప్పులుప్పతిలు నప్పూజప్పరంబునధిష్ఠించి.

చ॥ పలుమరుతన్నఖాంచలవిపాటితనూతనకేతకాంతరో
జ్జ్వలదళసంఘసంఘటితచారుకటోత్కటకాంతిగాంచి మేల్
భళి యిదివింతయౌర వనపాల యటంచును మెచ్చి వేడ్కతో
నలజలజాక్షుఁ డొక్కయెడియారమొసంగె నెసంగవానికిన్ 93

వ॥ అంత.

సీ॥ మండితశ్రీఖండమండలీకోరకంబులఁ జేరి డాగురుమూతలాడి
కోరకాపూరితస్ఫారమల్లీలతాజాలంబులందు నుయ్యాలలూగి
ఘనసారకదళీకావనసారకళికలసడలు దుమారంబుఁ జల్లులాడి
మారందనాభిదఘ్రాణరామసాలాలవాలాళియందులనోలలాడి
యలసియో లేకయప్పరియళ్వవేగ మరసిలజ్జించియో లేకయబ్జముఖుల
జడలుకృష్ణాహులనిచాలశంకపడియొ మెల్లనరుదెంచె బాలసమీరణంబు 95

తే॥ చిరుతతెమ్మెరయప్పుడు దాక్షిణ్యవృత్తి। జాగి యానతసుమనఃపరాగ మెల్ల
వదలఁజేయుచు క్షితిమానవసుఖదాయి। యగుచుఁ దనలరెను హరినామమమరకున్నె॥

కం॥ జిగిగలకెమ్మోవులఁ జిరు। నగవులునిగనిగలుదేర నవ్యధ్వనితోఁ
దగనందరొక్క మొగిరమై। సొగటాలాడుదమటంచు సుదతులుబల్కన్॥ 97

చం॥ బలితపుఁబద్మబాండమను పాళిఘటించి చటమీద బద్ధజీ
వుల నెడిసారెలుంచి రహిఁబుట్టఁగ నమ్మహిరెందునామములో
గల బలుపాచికల్గొని యలౌకికచిత్రదురోదరంబుఁ దా
నలరమతోడనాడు కమలాక్షుఁడు మైకొనెనట్టిజూదమున్॥ 98

కం॥ అత్తఱిఁ జకచకలీనెడు । ముత్తెపుఁబాచికలు కనకపుంబాలికడుక్
జొత్తిలఁ పగడపుసారెలు । తత్తరమునఁ దెచ్చియొకతె తరుణులకిచ్చెన్ ॥ 99

తే॥ ఇయ్యకొని యందుకొనియంత నింతులెల్లఁ । గుండలాకారమొప్పఁ గూర్చుండినపుడుఁ
బాళిఘటియించి సారెలుబన్ని తాము । కోర్కెనొండొరులనుజతల్గూడనపుడు ॥ 100

సీ॥ మొగమునకోడిపూరిగఁజిక్కి శరణనిమనఁగవచ్చిన చందమామయనఁగఁ
దనకురాజైనయాతని గొల్వవచ్చిన చక్కనియుడుగంపుచుక్కయనఁగఁ
జెలికాని కాతిఁ వచ్చెనటంచునాతని నరయవచ్చిన ప్రభాకరుఁడనంగఁ
దొంటివేడిమిఁ బాసికంటికింపుగ మేననిండిన పాండుసీరెండయనఁగ
మరియుఁ తిరుమణిముకుకమ్మి ముత్తియంబు । రవ్యపతకంబు పీతాంబరంబు మెరయఁ
జెలులచుంబనపణమాడి చేయిఁజరచి । కేరుచునుజూచమాడె మురారియచట ॥ 101

సీ॥ కంకణంబులుమ్రోయఁగా దుగా బేత్రి చొవంచంచుఁబందెముల్ వైచువారు
వాసిఁబందెమువైచి యేసారెయని సారెనంచించితగ సారెలాడువారు
ఆడుమాటల జూదమాడఁగూడదటంచుఁ బరులనుల్లసములుపలుకువారు
తమినొరుసారెచేఁదనసారెఁబడుచు సుందరినోర్తువీక్షించినగెడువారు
నాతియొక్కతె సావధానముగ నెత్తు । లంచనలుజూడఁగనుపత్తరించువారు
నగుచుఁజెలరేగియపుడు దైత్యారితోడ । నింతులితర ప్రపంచంబులెల్లమరచి ॥ 102

వ॥ మరియును. 103

## ర గ డ.

చేడియకోపము చెప్పినమాటకుఁ బాడిదప్పినా భామామాటకు
హేలగఁజూచెద వీడఁగనాడకు తాళముసారెకుఁ దప్పగనాడకు
కనవాయెక్కుడు కనుగవచేరకు వనరివేడ్కఁజనివాదుకుజేరకు
పందెమువైచితి పంజులకమ్మకు సుందరినైకొని సుదతింగమ్మకు
నీమాటలసిరి నేరుపుచిల్కకుఁ గోమలివాటపుఁగ్రోధముజిల్కకు
నీకొకఘనమా నేర్పులనిక్కకు జోకనుదను గెల్చుటకునునిక్కకు
హాళినాడ గోరానినజేరకు చాలనులికిపడిచలియలజేరకు
కత్తియపాల్గొనుకస్తురియుండకు పొత్తులగెలుపదిపోనిదియుండకు
రామతెలిసెనీరక్కసిదాయకు నీమృషలన్నియు నిజమనిదాయకు
దక్కియోడెనని తాపపుటుబ్బకు చిక్కదవిటుగెలిచెదననియుబ్బకు

పగిడిపండెమిదిబంగరుగోరకు మగువయోండి క్రమ్మరరాఁగోరకు
బాలగెలిచెనేబాడినయేలకు తాళకకటువార్తలనన్నేలకు
వెలదిజంటవేవెన్నునియానకు గెలిచిమొగంబునఁ గికకికలానకు 104

వ॥ అనుచుఁదమలోనవఱియును. 105

సీ॥ సారసాస్యయొకర్తుసారెఁదెచ్చితినన్న సారెకుఁగలుగువాచవియటంచు
ప్రీడావతియొకర్తుజోడుగూడుమటన్న నెవ్వరిమీఁదండెత్తెదనుచు
వామాక్షియొకతెతీవంచవేయుమటన్న నదిశిల్పిరాకర్షిపట్టౌనటంచు
సుదతియొక్కతెయెత్తుఁజూడఁగదగునన్న నొకపట్లమిగులంగనొప్పునటంచు
సరససల్లాపభంగినుత్సాహమొంది చేడెలెల్లదురోదరక్రీడనుండి
రక్షవిక్షేపచలవిలయస్వనోద హాస్తముఖపంకజభ్రమద్భ్రమరలగుచు 106

శా॥ పశ్యత్పాదకణా కుమారిలగత్పక్షాపషండబుద్ధాబ్జభూ
పశ్యత్ఫాలమతప్రచండనుతతత్వం కేశజాడ్యాద్రిరా
ట్పశ్యాందేహాత్పపాణదుర్ఘటవచఃపద్యాప్తహృద్యానసా
పశ్యత్స్వాంతశిరఃపరిష్కరణశుంభద్భాష్యకారాహ్వయా 107

గద్య

ఇది శ్రీమద్రామానుజభాగినేయకులసార్వభౌమ
శ్రీమన్నల్లనాచార్యవర్యపరిచర్యాధుర్య
చెన్నకేశవాచార్యపుత్ర
తిరుమలాచార్యపౌత్ర
గౌతమగోత్రపవిత్ర
సింహాద్రివెంకట
నామధేయప్ర
ణీతంబైన

**మహాప్రబంధ చమత్కారమంజరీ కోరకాయితంబగు**

**ప్రథమాశ్వాసము**

---